ssued — 27-9-1954




# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## TUESDAY, 1st DECEMBER, 1953

## VOLUME 1—No. 7

CONTENTS



PRINTED FOR ANDHRA GOVERNMENT PRESS

BY GORDON PRESS, GUNTUR-2.

1954

PRICE, 6 *annas*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

**TUESDAY, 1st December 1953.**

The House met in the Assembly Chamber, Kurnool at ten of the Clock, Mr. Speaker (The Hon. Sri N. VENKATRAMAIYA) in the Chair.

[*Note:*—(*) **An asterisk at the commencement of the speech indicates correction by the Member.**

Sri C. V. K. RAO:—Point of order, Sir. శాసనసభ సమావేశమైన ప్రతిరోజు మొదటిగంట ప్రశ్నోత్తరాలకు ప్రత్యేకించాలి. గవర్నరు గారి ప్రసంగం అయిన తరువాత అయినా ఒక గంట ప్రశ్నలకు, సమాధానాలకు ప్రత్యేకిస్తారని ఆశించాము. చాలామందికి ప్రశ్నలు ముందుగానే అందచేశాము. చాలా ముఖ్యమైన విషయాలు కొన్ని తెలుసుకోవాలనికూడా కోరాము. ఇదివరకు మద్రాసు స్టేటులో వుండగానే కొన్ని ప్రశ్నలుపంపించాం. నేటికీ ఇంతవరకు సమాధానాలు లేవు. కొన్ని కొన్ని ఆఫీసులకు సంబంధించిన ప్రశ్నలు ఏమైనాయో చెప్పలేకుండా వున్నారు. దయవుంచి స్పీకరు గారు మా ప్రశ్నలకు సమాధానాలు తెప్పించమని కోరుచున్నాను.

Mr. SPEAKER:— ఇదివరలో ఈ విషయమై సమాధానం చెప్పియే వున్నాను. ప్రశ్నలు ఆ యా డిపార్టుమెంటులకు పంపబడ్డాయి. జవాబులు రాగానే agenda లో చేరిపిస్తాము.

Sri K. RAJAGOPALA RAO:—నిన్న అనధికార తీర్మానంపై చర్చ జరిగిన సందర్భంలో సంజీవరెడ్డిగారు ఒక statement ఇచ్చారు. వాటి కాపీలను సభ్యులకు అందచేయాలని కోరుతున్నాను.

* Sri M. VEERABHADRAM:—ఒక ముఖ్యవిషయం తమ దృష్టికి తీసుకురావాలని అభిప్రాయ పడుతున్నాను. సభావ్యవహారం గురించి rules కొన్ని వున్నాయి. ఆ rules అన్నీ Article 208 (2) of the Constitution క్రింద చేయబడి వున్నాయి. మద్రాసు శాసన సభా వ్యవహారముల కోసము చేయబడిన ఆ rules ఇప్పుడూ అమల్లో వున్నాయి.

[Sri M. Veerabhadram] [1st December 1953

Article 208 (1) of the Constitution ఏమి చెపుతోందంటే "The House of the Legislature of a State may make rules for regulating, subject to the provisions of the Constitution, its procedure and conduct of its business." కాని మనం అవలంబించే rules అన్నీకూడా Article 208 (2) క్రింద మద్రాస్ శాసన సభ స్పీకరుగారిచే చేయబడినాయి. మద్రాసు శాసన సభకు సంబంధించిన rules లో మనకు సంబంధం లేనివికూడా వున్నాయి. గత 4 రోజుల బట్టి చర్చలలో ఎదుర్కొన్న అనేక క్లిష్ట సమస్యలను పరిష్కరించే rules అందులో కానరావు. కాబట్టి ప్రధానమైన విషయాలకు సంబంధించి rules మార్పు చేసే నిమిత్తం ఒక కమిటీని వేయవలసి వుంటుంది. ఇదివరలో ఒక కమిటీ వేసినారు. కాని ఆ కమిటీ ఏమి చేసిందో తెలియదు. ఈ విషయంలో తగు చర్యతీసుకోవాలని కోరుతున్నాను.

## I. PRIVILEGE MOTION RE: FAILURE TO APPOINT A SPEAKER TO THE ANDHRA LEGISLATIVE ASSEMBLY TILL 25-10-'53.

Mr. SPEAKER :— శ్రీ ఖండవల్లి కృష్ణరావుగారు ఒక privilege motion ఇచ్చారు. దాన్ని వారు చదువుతారు; నేను admit చేస్తే మాట్లాడవచ్చును.

Sri K. KRISHNA RAO :— Sir, my motion runs thus: "Whereas as per Article 179 (c) of the Constitution of India the office of Hon. the Speaker is an ever-continuing office; and whereas specific provision is made in Article 180 (1) of the Constitution of India to see that at no time the office of Hon. the Speaker is kept vacant; and whereas the Andhra State was formed on 1-10-1953 as per Act XXX (Union) of 1953 and whereas Sections 15 and 16 of the Act lay down the provisions by which the hon. Members constituting the Andhra Legislative Assembly are to be elected are specified; and whereas the Governor of the Andhra State who was to appoint the Speaker to the Andhra Legislative Assembly as from 1—10—1953, has, in spite of his attention being drawn to the provisions of the Constitution governing the appointment of the Speaker, kept the office of Hon. the Speaker vacant and unfilled from 1—10—1953 up to 25—10—1953; and whereas the office of Hon. the Speaker is an important constituent of the Legislative Assembly to

1st December 1953] [Sri K. Krishna Rao]

function at all times whether or not the Assembly is in session, to admit questions given notice of by Hon. Members and to obtain answers to questions by communicating the questions so admitted to the appropriate Ministers and to get answers to the same by forwarding the questions so admitted to the appropriate Minister and to get answers to the same for being presented to the Legislative Assembly; and whereas the failure to appoint one hon. Member of the Andhra Legislative Assembly to the office of Hon. the Speaker, operates to block, render ineffective and paralyse the rights of hon. Members of the Assembly to put questions and obtain appropriate answers in time; and whereas by such failure to appoint the Speaker, the rights and privileges of Members and of the House are curtailed, abrogated and rendered ineffective, constituting grave breach of the rights and privileges of the Members of the Andhra Legislative Assembly and of the House;

"Be it resolved that the failure to appoint any hon. Member of the Andhra Legislative Assembly to the office of Hon. the Speaker, and thus keeping in cold storage the Andhra Legislative Assembly and continuing to so keep it, constituting a grave breach of privileges of the House, as it does, be referred to the Committee of Privileges of the Andhra Legislative Assembly."

Mr. SPEAKER :— Unless I admit the motion the hon. Member cannot make a speech. I shall now give my ruling. 10-20 a.m.

An Hon. Members:—Please give the ruling in Telugu.

Mr. SPEAKER :— ఇప్పుడు కృష్ణారావుగారు ఇచ్చిన motion ఏమిటంటే గవర్నరుగారు Speaker ను వెంటనే appoint చేయలేదనీ, అట్లా Speaker లేకుండా కొన్నాళ్లు Speaker పదవి ఖాళీగా వున్నందు వల్ల సభ్యులు ప్రశ్నలు పంపించడం, Speaker ఆలోచించి జవాబులు తెప్పించే అవకాశం, member లకు పోయిందనీ, members privilegesకు భంగం కలిగింది కాబట్టి privilege motion తెచ్చుచున్నారు. నేను చెప్పేదేమిటంటే Constitution Act Article 180 (sub-article) ప్రకారం Speaker పదవి ఖాళీగాయుంటే Deputy Speaker ఆ Speaker

[Mr. Speaker] [1st December 1953

ఉద్యోగ ధర్మం నిర్వర్తిస్తూ వుంటాడనీ, Speaker, Deputy Speaker పదవులు రెండూ ఖాళీగా వున్నప్పుడు గవర్నరు appoint చేసిన యింకో Speaker ఆ పని చేస్తూవుంటాడని చెప్పివుంది. గవర్నరుగారు ఎన్నాళ్ళలో Speaker ను appoint చేయవలసినదీ, గవర్నరు Speaker పదవిని ఒక రోజుకూడా ఖాళీగా వుంచకూడదనీ యిందులో కనపడ్డం లేదు. "Such member of the Assembly as the Governor may appoint for this purpose" అని ఉన్నదేగాని ఎన్నిరోజులలోగా Speaker ను appoint చేయాలో ఇందులో ఏమీ లేదు. సభ్యులు, శ్రీ కృష్ణరావుగారు ప్రశ్నలు పంపించివుంటే సమాధానాలు సావకాశంగా యివ్వబడుతవి.

Sri K. KRISHNA RAO:—నేను October మొదటి తేదీ నుండి ఇంతవరకు 90 ప్రశ్నలు పంపించాను. ఆ తరువాతకూడా పంపిస్తున్నాను. ఈ రోజువరకు అసలు అవి ఏమయ్యాయో తెలియదు. నేను విచారిస్తే అవి concerned departments కు కూడా పంపబడలేదని తెలుస్తున్నది. ఇది ప్రత్యేకంగా నా privilege కి భంగం అయినది.

Mr. SPEAKER:— అయినప్పటికీ clear గా article లో time limit లేదు. కాబట్టి Speaker ను appoint చేయలేదు. Assembly కొత్తగా స్థాపించబడినది. 25-10-1953 న Speaker ను appoint చేశారు. అట్టి పరిస్థితిలో Article 180 (1) ప్రకారం; "No question of any privilege arises. The motion is, therefore, disallowed" అని రూలింగు ఇస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU:—Prima facie case వున్నదో లేదో చెప్పడానికి member కు అవకాశం యివ్వాలి అని మా అభిప్రాయం. అసలు మీ అభిప్రాయంకూడా వినాలని కోరుతున్నాను. Prima facie case కూడా వున్నదో లేదో చెప్పుటకు అవకాశం యిచ్చి రూలింగు యివ్వాలని కోరుతున్నాను.

Mr. SPEAKER:—ఇదివరకు ఆ file అంతా చూచాను. రూలింగు యిచ్చాను. తిరిగి మాట్లాడ్డానికి అవకాశం వుండదని చెబుతున్నాను.

1st December 1953]

Sri M. HANUMANTHA RAO:—Sir, on a point of order; తమ రూలింగుకు భిన్నం లేకుండా మనవి చేసేది ఏమిటంటే, ఏదైనా ఒక adjournment ను motion move చేసినప్పుడు prima facie case వున్నదని చెప్పడానికి ఆ motion యిచ్చినటువంటి వారికి అవకాశం ఉన్నట్లు యిదివరకు పాటించారను కుంటాను. ఇక ముందైనా ఆ అవకాశం కల్పించాలని Speaker గారికి మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER:—"With the consent of the Speaker" అని రూల్సులో వున్నది. రూల్సు చూచి చెబుతున్నాను.

Sri K. KRISHNA RAO:—Prima facie case వున్నదని చెప్పడానికి అవకాశం గురించిగాని, Speaker గారు case త్రోసిపారవేయడం గురించి కాదని మనవి చేస్తున్నాను. దానిని question చేయడం లేదు. Prima facie case విషయంలో రెండు ముక్కలు చెప్పదలచుకున్నాను. ఇందులో చాలా constitutional points ను discuss చేయవలసియున్నది. Prima facie case వున్నది కాబట్టి పంపించాను. అంత నాకు తెలియకుండా పంపించలేదు. May's Parliamentary Practice గురించి Speaker గారు చెప్పారు. ఇక నా prima facie case గురించి చెబుతున్నాను. దీనికి precedents వున్నవి. వెనుకటి రోజుల్లో ప్రకాశం పంతులుగారు మంత్రుల మీద charge-sheet పెట్టినపుడు మాట్లాడ్డానికి అవకాశం యిచ్చారు. తరువాత త్రోసిపారేశారు. అందుచేత privilege అనేటటువంటిది నా ఒక్కడిదేకాదు, 140 మంది సభ్యులది. Privilege ఆంధ్ర ప్రజానీకం అంతటిదీ అందువల్ల అవకాశం యివ్వాలని కోరుతున్నాను.

Mr. SPEAKER:— Order, Order. తమరు చేసిన 50 పేజీల correspondence అంతా చదివాను. Article 180 sub-article ప్రకారం finding యిచ్చాను.

Sri K. KRISHNA RAO:—Prima facie case ను గురించి చర్చించే అవకాశం యిచ్చే సాంప్రదాయా లున్నాయి. మిమ్ములను question చేయడం నా వుద్దేశం కాదు. Prima facie case చెప్పడానికి అవకాశం యివ్వాలి.

Mr. SPEAKER:— ఇది వరకు రూలింగు యిచ్చాను. తరువాత rules చూచాను. అందులో వున్నదేమిటంటే prima facie case వున్నదని Speaker నిర్ణయించి తరువాత Speaker allow చేస్తేనే సభ్యుడు మాట్లాడుటకు వీలువున్నట్టు కన్పిస్తుంది. ఈ question ను re-open చేయడానికి వీలులేదు.

తరువాత కొన్ని adjournment motions వున్నాయి.

## II. ADJOURNMENT MOTIONS

### (i) ADJOURNMENT MOTION RE: DELAY IN THE GRANT OF AGRICULTURAL LOANS ETC.

Mr. SPEAKER:—Sri V. Chidanandam has given notice of an adjournment motion. The hon. Member will read his adjournment motion.

The hon. Member is not in his place.

తరువాత లక్ష్మీనారాయణ రెడ్డిగారు ఇంకో adjournment motion ఇచ్చారు. అది వారు చదివితే దానిమీద నేను రూలింగ్ ఇస్తాను.

Sri T. LAKSHMINARAYANA REDDI:—Mr. Speaker, I move the following adjournment motion: "This House stands adjourned to discuss a matter of urgent public importance, namely, inordinate delay in the matter of grant of agricultural loans for seeds etc. resulting in the holding up of cultivation by thousands of ryots of their lands in Anantapur District."

మీరు రూలింగ్ ఇచ్చేదానికిముందు నాలుగు మాటలు చెప్పాలని కోరుతున్నాను. ఇప్పుడు రైతులు పడుతున్న ఇబ్బందులను గురించి ప్రత్యేకంగా చెప్పుతున్నాను. ప్రభుత్వంవారు అధికాహారోత్పత్తి కావాలని ఒకమూల చెప్పుతూనే ఉన్నారు. ఇతర దేశాలనుండి ఆహారపదార్థాలను దిగుమతి చేసుకుంటూనే ఉన్నారు. కాని అనేకమంది బీద రైతులు వ్యవసాయపు అప్పులకోసం చాలా రోజులనుండి తాలూకాఫీసులచుట్టూ, అక్కడనుండే గుమాస్తాలచుట్టూ తిరుగుతూంటే ఇంతవరకూ ఏ చర్య తీసుకోనందువల్ల మా జిల్లాలో రైతులు ఎక్కువ ఆహారం పండించడానికి వీలులేకపోతున్నదని, దీనిపై చర్చ జరగాలని నేను మిమ్ములను కోరుతున్నాను.

1st December 1953]

Mr. SPEAKER :— అప్పులు అడిగేవారు యెందుకు అప్పు యివ్వలేదు అని అడిగే హక్కు లేదు. అప్పులు అప్పుగానే అడగాలి. కనుక ఈ హౌస్‌యొక్క business ను adjourn చేయవలసినటువంటి అవసరం లేదని, నేను దీన్ని disallow చేస్తున్నాను. ఇప్పుడు కృష్ణారావుగారు వారి తీర్మానాన్ని చదివి వినిపించవచ్చు.

## (ii) ADJOURNMENT MOTION RE: NOT PROVIDING FACILITIES TO MUFASSAL POLICE PERSONNEL BROUGHT TO KURNOOL FOR BANDOBUST DUTY.

Sri K. KRISHNA RAO :—Mr. Speaker, I move the following adjournment motion : "Resolved that the business of the House be adjourned to discuss a matter of urgent public importance, viz. the getting of a large number of police constables attached to stations outside Kurnool, to do bandobust duty at Kurnool during the session of the Legislative Assembly without providing them with adequate meals and coffee, or with allowance sufficient to meet cost of meals and tiffin, while at Kurnool."

దీన్నిగురించి రెండు ముక్కలు చెప్పవలసి ఉంటుంది. ఆర్యా ! ఇది సాధారణ బందోబస్తు డ్యూటీకి ఎక్కువగా కర్నూల్లో ఉండేటటువంటి కాన్‌స్టేబుల్సేకాదు, బయట ఉండేటటువంటివారికికూడా టి. ఏ. గాను ఇతర అలవెన్సులుగాను వాళ్లకు రోజుకు ఇచ్చేది 12 అణాలు. అసలు ఇటువంటి గడ్డురోజుల్లో ఈ 12 అణాలు ఏవిధంగా సరిపోతుంది ? వాళ్లకు రెండు పూటలు భోజనమే వస్తుందా ? కాఫీ, సిగరెట్లు, బీడీలు ఏమైనా అలవాటుంటే వాటికే సరిపోతుందా ? అదీకాక వాళ్ళకు ఈ 12 అణాల డబ్బులైనా డ్యూటీనుంచి తిరిగి వస్తేగాని ఇవ్వకపోవడం, వాళ్లు అప్పు చేసికొనివస్తే ఆ టి. ఏ. ఎవరిస్తారు ? దానిమీందేమైనా వడ్డీ ఉంటే అదెవ రిస్తారో ? నాకు తెలియదు. ఈ విషయాన్నే మద్రాసులో శ్రీ రాజ గోపాలాచారిగారిని ఒకసారి అడిగితే వారు మేము కొత్తగా తెచ్చిపెట్టింది కాదు, ఇదివరకటినుండి అమల్లో ఉన్నదే అని జవాబిచ్చారు. ఇంతకు నేను చెప్పేది; ఇలా చేస్తే వాళ్ళలో ఎంత అసంతృప్తి ఉంటుంది? రెండోదేమంటే నేను చెప్పేది; ఈ వేళ బందోబస్తు డ్యూటీలో ఉన్నవాళ్ళను ఏవిధంగా మేము చూస్తూ ఊరుకోవాలో అర్థంకాకుండాఉంది. తరువాత ఈ adjournment motion విషయంలో......

Mr. SPEAKER:—Deputy Chief Minister దానికి సంబంధించిన శాఖవారు కనుక వారేమి చెపుతారో చూస్తాను.

The Hon. Sri N. SANJEEVA REDDI:—అధ్యక్షా! ఎడ్జర్న్మెంట్ మోషన్ సాధారణమైన పరిస్థితులలో కాకుండా ఏదైన అర్జంట్ విషయాల్లో అయితేనే ఆలోచించవలసి ఉంటుంది. మద్రాస్ సభలో కూడా ఈ విషయాన్ని చర్చించాం అని చెప్పారు. అందులోను ఇప్పుడు పోలీసు సమస్యే తెచ్చాం (నవ్వు). పోలీసురాజ్యం పోలీసురాజ్యం అని చెపుతూ వాళ్ళను రక్షించడానికి వచ్చారు. 12 అణాలు ఇస్తున్నారంటే ఇది మేము వచ్చిన తరవాత చేసిందికాదు. ఇదివరకటినుంచి వస్తున్నదే. అంటే ఒకప్పుడు 12 అణాలిచ్చి, ఇంకోప్పుడు ఒక రూపాయి యిస్తారనా ? అందుచేత ఈ శాసనం మార్చినప్పుడు ఏదైనా వీలుంటే రాష్ట్ర ప్రభుత్వం ఆలోచించడానికి తీసుకోవాలి. అందుచేత ఇది పబ్లిక్ ఇంపార్టెన్స్ కాదని, దీన్ని చర్చించవలసిన అవసరంలేదని చెప్తున్నాను.

Mr. SPEAKER:—These are individual grievances of services which have to be redressed by approaching the authorities and the adjournment motion involves no urgent matter of public importance and it is therefore disallowed.

### (iii) ADJOURNMENT MOTION RE: LATHI CHARGE ON STUDENTS IN KURNOOL.

Sri M. VENKATASUBBA REDDI:—Mr. Speaker, I move the following adjournment motion: "This House stands adjourned to discuss an urgent matter of public importance of Government responsibility regarding the lathi charge on students just now at 11-15 A.M. near Municipal High School."

Speaker Sir, నిన్న ఉస్మానియా కాలేజీ విద్యార్థులు కాలేజీనుంచి తిరిగి వస్తూన్న సందర్భంలో వాళ్లు గుంపులుగా ఏమీ అల్లరిచెయ్యకుండా ప్రశాంతంగా వెళ్తున్న సమయంలో లెజిస్లేటర్స్ హాస్టలుకు సమీపంలో వారిని అడ్డపెట్టి లాఠీచార్జి చేశారు. విద్యార్థి కాంగ్రెస్ ప్రెసిడెంట్ శ్రీ డి. వి. సుబ్బారెడ్డి అనే అతన్ని ఒక పోలీసు ఆఫీసరు కొట్టాడు, అప్పుడు అతను స్పృహతప్పి పడిపోయాడు. మిగతా విద్యార్థులు పడిపోయిన విద్యార్థిని లేవదీశారు. నిజంగా అలాంటి అవమానకర పరిస్థితులు సహించరానివి. ......

1st December 1953]

Mr. SPEAKER :— ఇది పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ మాత్రమే.

Sri G. C. KONDAYYA:—On a Point of Information, Sir. పోలీసువారు కర్నూలులో వుండబట్టే అలాంటి adjournment motions వస్తాయి. 10-40 a.m.

The Hon. Sri N. SANJEEVA REDDI:—ఆ రోజు కావలసి వచ్చింది. ఈ రోజు కావలసివచ్చింది.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:—అయితే...

Mr. SPEAKER:— పోలీసువారు లేకపోతే protection ఎవరు యిస్తారు?

The motion involves no urgent matter of public importance. The Police are bound to maintain law and order and are entitled to use necessary force for preventing breach of peace. But in this case the aggrieved party may take legal action and this cannot be made a basis for an adjournment motion. Hence the adjournment motion is disallowed.

(iv) SITUATION CREATED BY THE DROPPING OF PROCEEDINGS AGAINST THE DEPUTY INSPECTOR OF SCHOOLS, PONNUR, BY THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, (ANDHRA).

* Sri K. VENKIAH :—Mr. Speaker, I move the following adjournment motion: "This House stands adjourned to discuss a matter of public importance, namely, the situation created as a result of dropping the proceedings by the Director of Public Instruction, Andhra, against the Deputy Inspector of Schools, Ponnur, in the matter of the molestation of a lady teacher of Doppalapudi village, Bapatla taluk."

అధ్యక్షా, ఈ మధ్య Director of Public Instruction యీ case కు సంబంధించిన proceedings, ఆయన ఆపినట్లు స్పష్టమైంది. బాపట్ల తాలూకా దొప్పలపూడి గ్రామంలో ఒక Lady Teacher ను Deputy Inspector of Schools దౌర్జన్యంచేసి, ముఖ్యంగా ఆమె శీలాన్ని చెరచ ప్రయత్నించారు. ఆ విషయం ఆ గ్రామంలోని ప్రజ లందరి దృష్టికి ఉపాధ్యాయుల దృష్టికి తీసుకురావడం జరిగింది. ఇలాంటి

[Sri K. Venkiah] [1st December 1953

సందర్భంలో అవమానించబడిన ఉపాధ్యాయిని ఫిర్యాదు చేయగా Director యింతపెద్ద case కాదని, విచారణ మాని proceedings ను drop చేయడం జరిగింది. ఇది విద్యాశాఖకు సంబంధించిన విషయం. విద్యాశాఖయొక్క ప్రధానోద్దేశము ప్రజలకు విజ్ఞానము కలుగజేయడం. అటువంటి విజ్ఞానాన్ని, వికాసమును కలుగజేసేది విద్యాశాఖ అయివుండి కూడ, అందులో పనిచేసే ఒక వుద్యోగి తన subordinate విషయంలో యిట్లా ప్రవర్తించాడంటే చాల బాధకరంగా వుంటుంది. ఈ విద్యాశాఖ మన మందరము కలిసి యేర్పాటుచేసిన శాఖ. అలాంటిది, ప్రభుత్వం వూరక చూస్తూవుంటే, ఆ విషయంలో ఆ case పరిశీలించకుండావుంటే చాల ప్రమాదకరమైన పరిస్థితులు యేర్పడుతున్నాయి. ఇందువల్ల ప్రజలలో కూడ చాల అసహ్యాకరమైనభావం, రోతపుట్టించే భావం (పరిస్థితులు) యేర్పడింది. ఇది యీ మధ్యనే జరిగిన సంగతి. ఇది ఆ గ్రామ ప్రజలందరకు సంబంధించిన విషయము. ఇట్టి తీవ్ర పరిస్థితులలో, యిది చాల అవసరమైన విషయమని, దీన్ని గురించి శ్రద్ధవహించకపోతే, నిర్లక్ష్యభావంతో చూస్తే, యిది తీవ్రపరిణామాలకు దారితీస్తుందని నేను చెప్తున్నాను. ఇది కేవలం ఒక్క ప్రజలకు సంబంధించిన విషయమేకాక, ప్రభుత్వానికికూడ సంబంధించిన విషయమనిన్నీ, అయినా దీన్ని ఈనాటి చర్చకు allow చేయాలని తమకు విజ్ఞప్తి చేస్తున్నాను.

(Interruption by Sri K. Venkiah)

**Mr. SPEAKER** :—మీరు ఒకసారి మాట్లాడారు. తర్వాత రెండవ వారుకూడ మాట్లాడాలని చెప్తున్నాను. అలాకాకపోతే rule కు భిన్నం జరుగుతుంది. Director of Public Instruction వారిని, ఆయన వారి మిత్రులు అనేకులు కలిసి influence చేసి proceedings ను drop చేశారనకండి. D. P. I. report యివ్వకుండా వుండినా, మీరు Dircetor మీద 354 I. P. C. క్రింద కోర్టులో చార్జి పెట్టుకొని వుండవలసింది. దానిపై వారు యేదో శిక్షవేసి వుండేవారు. దానికి వారు సంజాయిషీ చెప్పుకొని వుండేవారు. The motion is therefore disallowed.

ఈ రోజు కార్యక్రమంలో, మొదటి విషయం యేమిటంటే, యిదా

1st December 1953] [Mr. Speaker]

State Co-operative Societies (Reconstitusion and Formation) Bill, 1953 ను గా॥ డి. సంజీవయ్యగారు Minister for Planning and Public Health introduce చేస్తారు. Introduce చేసిన తరువాత యీ బిల్లును consideration లోనికి తీసుకోవలసివుంటుంది.

### III. GOVERNMENT BILLS.

#### (1) THE STATE CO-OPERATIVE SOCIETIES (RECONSTITUTION AND FORMATION) BILL, 1953.

The Hon. Sri D. SANJIVAYYA :—Mr. Speaker, I beg to introduce the State Co-operative Societies (Reconstitution and Formation) Bill, 1953, and move that the Bill be taken into consideration at once.

అధ్యక్షా, ఈ బిల్లును ప్రతిపాదిస్తూ, యీ సందర్భములో రెండు విషయాలు గా॥ లైన సభ్యులకు మనవి చేస్తున్నాను. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత, ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినటువంటి సహకార ఉద్యమమును గురించి, సహకార సంస్థలను గురించి ఆలోచించే పరిస్థితి యేర్పడింది. ఆంధ్రరాష్ట్రము యేర్పడేముందు ఆంధ్ర ప్రాంతానికి తదితర మద్రాసులో వున్న ప్రాంతానికి, యీ రెండిటికి కలసి మూడు పెద్ద సహకార సంస్థలు వుంటూ వచ్చాయి. ఒకటి, Madras State Co-operative Bank అని, రెండవది, Madras State Central Land Mortgage Bank అని, మూడవది, Madras Handloom Weavers,Co-operative Society, అని వుండేవి. ఈ మూడింటిని కూడ విభజించి, పరిశిష్ట మద్రాసు రాష్ట్రానికి వాటిని reconstitute చేయడం జరిగింది. అదే విధముగా ఆంధ్రరాష్ట్రానికి కూడ పై మూడుసంస్థలను reconstitute చేయవలసిన అవసరము ఉంది. ఈ అవకాశాన్ని తలపెట్టినటువంటి కార్యక్రమం నిర్వహించుకోవడానికి అప్పుడు Madras రాష్ట్రంలోవున్న Co-operative Act క్రింద చేయడానికి వీలులేకపోయింది. చేయవలసినదల్లా ఆ Co-operative Act ను సవరణ అప్పుడు ఆ శాసన సభ Governor గారి ద్వారా Constitution ప్రకారము ఒక Ordinance జారీచేశారు. దాన్ని, Madras Ordinance No 2 అని చెప్పి, అమలు చేసినారు. ఈ

[The Hon. Sri D. Sanjivayya] [1st December 1953

Ordinance క్రింద యీ మూడు సహకార సంస్థలను విభజించి ఆంధ్రరాష్ట్రానికి 3 ప్రత్యేక సంస్థలను యేర్పాటు చేశాము. ఈ ordinance గురించి గౌ॥ సభ్యులకు తెలుసు. ఎప్పుడైనా ప్రభుత్వం ordinance చేసినట్లైతే, దానిని ఒక చట్టంక్రింద శాశ్వతంగా అమలులో వుంచడానికి వీలుగా ఈ శాసనసభా సమావేశమైనపుడు బిల్లు పాస్ చేయవలసి వుంటుంది. అట్లు కాని పక్షంలో విపరీతమైన సందర్భాలు యేర్పడుతవి. ఆనాడు September 4 న చేయబడిన ordinance గడువు తీరిపోతుంది కాబట్టి తిరిగి క్రొత్తగా నిర్వహణ జరగవలెను. వీటి ప్రకారముగా, యీ ordinance క్రింద power యిచ్చి, ordinance లో వున్న power వినియోగించుకోవాలంటే మొదట 'Act must first be put to vote and decision taken', అప్పుడు వాటికి ఒక permanent effect యివ్వవలసిన యేర్పాటు చేయాలి.

ఆ ordinance ను replace చేయడానికి కాదు. ఆ ordinance క్రింద చేసిన పనులకు permanent effect యివ్వవలెనని ఈ గౌరవ సభకు నేను మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER:— ఈ సభవారికి యిప్పుడు దీని మీద చర్చ జరపడానికి అనుమతిస్తాను. ఈ State Co-operative Societies (Re-constitution and Formation) Bill, 1953 ను వెంటనే చర్చకు తీసుకొందామని చెప్తున్నాను. General గా మాట్లాడడానికి అవకాశం కావలసిందని చెప్పిన సభ్యులకు యిప్పుడు అనుమతి యిస్తున్నాను. సభ్యుల పేర్లు నేను సూచిస్తాను. వారు మాట్లాడవచ్చు.

10-50 a.m. Sri VAVILALA GOPALAKRISHNAIAH:— అధ్యక్షా, ఈ బిల్లుమీద జనరల్ డిస్కషన్ జరిగేముందు, నేను, ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించాలనే సవరణ ఇచ్చాను. ఆ సవరణ ప్రతిపాదించిన తరువాత జనరల్ డిస్కషన్ తీసుకొంటే బాగుంటుంది. మీరు అనుమతి ఇస్తే, ఆ సవరణను ప్రతిపాదిస్తాను.

Mr. SPEAKER:— ప్రగడ కోటయ్యగారు మాట్లాడిన తరు

1st December 1953] [Mr. Speaker]

వాత మీ సవరణ move చేయవచ్చును. ఇప్పుడు ప్రగడ కోటయ్యగారు మాట్లాడుతారు.

* Sri PRAGADA KOTAIAH:—అధ్యక్షా, ఈ amendment క్రింద ప్రవేశపెట్టిన చట్టముయొక్క స్వరూపము, దాని అవసరాన్నిగూర్చి, మంత్రిగారు వివరించారు. అయితే, ప్రధానమైన వివరాలను మాత్రము ఈ సభయెదుట పెట్టడానికి వారు ప్రయత్నించలేదు. ఈ ఆర్డినెన్సు క్రింద, ఈ చెన్నరాష్ట్ర సహకార సంఘాన్ని, భూమి తనఖాబ్యాంకును, చేనేత సహకారసంఘాన్ని విభజన చేయుటకొరకు ప్రత్యేకమైన అధికారాన్ని అప్పటి ప్రభుత్వం తీసుకొన్నది. అందులో రిజిస్ట్రారుకు, తదితరులకును కొంత అధికారం ఇచ్చారు. Madras State Co-operative Bank విభజన కావడంలో జరిగిన ఆస్థి అప్పుల పంపక విధానం ఎట్టిది? Madras Residuary State లో ఉన్న Bank కు ఏ విధంగా ఆస్తి అప్పులు వెళ్లినాయి? ఆంధ్ర రాష్ట్రములో ఏర్పరచబడిన బ్యాంకుకు ఏ విధంగా ఆస్తి అప్పులు వచ్చాయి? ఆ విధంగానే భూమి తనఖాబ్యాంకు విభజనలోను, చేనేత సహకార సంఘముయొక్క విభజనలోనూ, చెన్నరాష్ట్రానికి ఆంధ్రరాష్ట్రానికి ఏ విధమైన ఆస్తి అప్పులు వచ్చాయి. మొత్తం ఈ వివరాలన్నీ ఈ సభముందు పెట్టకుండా, ప్రస్తుత సహకారసంఘ చట్టముక్రింద వాటిని విభజన చేయడానికి అవకాశములేదు. కాబట్టి, ప్రత్యేకమైన amendment ను పాస్ చేసి, వాటి విభజనకు పూనుకోవలసి వచ్చిందని మంత్రిగారు వివరించారు. ఈ సంఘముల విభజన విషయంలో ఆంధ్రులకు అన్యాయం జరిగిందా? ఏమైనా సమస్యలు వచ్చాయా ? పరస్పర సంప్రతింపులద్వారానే, ఏమీ తగాదాలు లేకుండానే, పరిష్కారం చేసుకొనగలిగారా ? వాటియొక్క ఆస్తి అప్పులను విభజించే విషయంలో ఈ ప్రభుత్వం పరిశీలించిందా? ఆంధ్రదేశములో ఏర్పడిన సంఘాలకు వచ్చిన ఆస్థి అప్పు లేమిటి ? సహకార బ్యాంకుయొక్క ఆస్తి అప్పులు ఏమిటి? భూమి తనఖా బ్యాంకుయొక్క ఆస్థి అప్పులు ఏమిటి ? రాష్ట్ర చేనేత సహకార సంఘమునకు వచ్చిన ఆస్థి అప్పులు ఏమిటి ? అనే సంగతిని మంత్రిగారు చెప్పలేదు. మనము ఆంధ్రరాష్ట్రములో ఈ మూడు సంఘాలద్వారా, దీర్ఘకాలపు అప్పులు ఇవ్వడానికి, లేదా స్వల్ప వడ్డీలపైన అప్పులు ఇవ్వడానికి, చేనేత సహకారోద్యమాన్ని వ్యాప్తి చేయడానికి, ఈ మూడింటికిని అవకాశమున్నదా? లేదా? చిన్న చిన్న

[Sri Pragada Kotaiah] [1st December 1953

primary mortgage banks కు అప్పులు ఇవ్వడానికి ఏవిధమైన అవకాశ మున్నది? ఈ మూడు సంఘములు, తమ కార్యములు సక్రమంగా నిర్వహించడానికి అనువైన విధానాలు పరిశీలించారా? వీటన్నింటిని ఆంధ్ర ప్రభుత్వము సక్రమంగా నిర్వహించడానికి ప్రయత్నించిందా? ఈ విషయాలేవీ విశదముగా చెప్పకుండా, ఈ మూడు సంఘముల నిర్మాణం జరిగిందన్నంత మాత్రంచేత, ఈ సభ సంతృప్తి పడడానికి అవకాశంలేదు. ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రములో వున్నరాష్ట్రి సహకార సంఘం మద్రాసులో డిపాజిట్లు తీసుకోవడానికి అవకాశంలేదు. ఈ సందర్భంలో ఆంధ్ర ప్రభుత్వం మద్రాసు ప్రభుత్వంతోను, మద్రాసు రిజిస్ట్రారుతోను వ్యవహారం జరిపి మద్రాసులో డిపాజిట్లు పొందడానికి ఆంధ్రరాష్ట్రి సహకార సంఘమునకు అవకాశము ఇప్పించగలరా? భూమి తనఖా బ్యాంకుకు కావలసిన పెట్టుబడిని ప్రభుత్వ హామీపైన ఇప్పించడానికి ప్రయత్నం చేసినారా? ఆంధ్ర దేశంలో 600 చేనేత సహకార సంఘాలు ఉన్నాయి. వీటిలో 1,12,000 మగ్గాలున్నాయి. కనీసం మగ్గానికి నెలకు 4 డబ్బీలు ప్రకారం నేయడానికి పూనుకుంటే, నూరు రూపాయల బట్ట అవుతుంది. ఈరకంగా ఒక కోటి రూపాయలబట్టను ఉత్పత్తిచేస్తే, ఈ బట్టను ఆంధ్రరాష్ట్రి చేనేత సహకారసంఘము కొని అమ్మవలసిన అవసరమున్నది. ఈ పరిస్థితులలో ఈ సంఘాలు పై విధముగా పనిచేయుటకు ఆంధ్ర ప్రభుత్వము ఏలాంటి చర్య తీసుకొన్నది, ఆస్తి అప్పుల విభజన విషయములో ఆంధ్రరాష్ట్రి సంఘములకు అన్యాయము జరుగకుండా ఏమి చర్య తీసుకొన్నది, మొదలగు విషయాలు మంత్రిగారు సూచించవలసియుంటుందని మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER:— Sri Vavilala Gopalakrishnaiah will now move his amendment.

Sri K. VENKIAH:— అధ్యక్షా, ఇప్పుడు జనరల్ చర్చ అనేటువంటిది జరుగుచున్నది. ఇది అయిన తరువాత సవరణలు తీసుకో వచ్చును. అయితే మీరు ఇప్పుడే సవరణలను move చేయవలసివుందని చెప్పుచున్నారు. ఇది సాంప్రదాయసిద్ధం కాదేమో అనుకొంటాను. ఈ విషయంలో మీ రూలింగు ఇవ్వాలని కోరుచున్నాను.

1st December 1953]

Sri K. KRISHNA RAO:—నేనుకూడ జనరల్ డిస్కషన్‌లో పాల్గొనడానికి అవకాశం ఇవ్వాలని కోరుతున్నాను. ప్రగడ కోటయ్యగారికి మాట్లాడేందుకు అవకాశం ఇచ్చారు. ఆ విధంగా నాకుకూడ అవకాశ మివ్వాలని కోరుచున్నాను.

Mr. SPEAKER:—The motion before the House is: "That the State Co-operative Societies (Reconstitution and Formation) Bill, 1953, be taken into consideration at once."

Now the hon. Member Sri Vavilala Gopalakrishnaiah will move his amendment.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH:—అధ్యక్షా, నావి రెండు సవరణలు ఉన్నవి. మొదటిది, ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపవలసిందని యున్నది. కనుక, ఈ సెలెక్టు కమిటీ position చూసిన తరువాత, రెండవ సవరణను ఉపపాదిస్తాను. ఇప్పుడు ఒకటిమాత్రమే ఉపపాదిస్తున్నాను.

Sir, I move: "that the Bill be referred to a Select Committee."

అధ్యక్షా, ఈ బిల్లు ordinance రూపములో ఉన్నందున, దాని విలువ 6 వారాలకు అయిపోతుంది కనుక, దానిని ఈ బిల్లు రూపములో తీసుకొని వచ్చామని మంత్రిగారు అన్నారు. మొట్టమొదట ఈ ordinance ఎందుకు తీసుకొని రావలసివచ్చింది అని అంటే, ఆంధ్రరాష్ట్ర విభజనకొరకు, ఆ తరువాత విభజన లెక్కలలో తగాదాలు వస్తాయని వాటిని పరిష్కరించేందుకు ఈ బిల్లు తీసుకొని రాబడినదని అన్నారు.

అయితే నేను అడిగితే యీబిల్లు మా ముందు పెట్టినప్పుడుమటుకు ఏవ చిక్కులు వచ్చునో అని అనుకున్నాము. లెక్కలు వేస్తున్నప్పుడు ఎవరెవరికి ఎంత ఆస్తి పోయిందోనని అనుకున్నాము. ఎందువల్ల యీ బిల్లు తీసుకొని వచ్చారు? అది వున్నను నేను అర్థము చేసుకొన్నకొద్దీ అప్పుడు జరిగినవి ఎన్నో ప్రశ్నలుగానే వున్నవి. ఉదాహరణగా, యిక్కడ మద్రాసు స్టేటు కోఆపరేటివ్ బ్యాంకు ఒకటి, మద్రాసు లాండు మార్టుగేజి బ్యాంకు

[Sri Vavilala Gopalakrishnaiah] [1st December 1953

ఒకటి, ది హాండులూము వీవర్సు కో ఆపరేటివ్ సొసైటీ అని ఒకటి, మూడు సంస్థలుగా విభజన చేశారు. ఈ విషయములో కొన్ని వివరాలు తెలియవలసియున్నవి. అసలు ఆస్తి మొత్తము ఎంత? అందులో రెసిడ్యూయరీ మద్రాసు స్టేటుకు ఎంత పోయింది? గ్యారంటీలు ఎంతవరకు యిచ్చారు? అందుకుగాను వచ్చే ఆస్తి ఎంత? డిపాజిట్ల మొత్తము ఎంత? మనకు వున్న డిపాజిట్ల విలువ ఎంత? లేకపోతే లెక్కలలో మొత్తము ఏమైనా write off జరిగిందా? ఈమాదిరి వివరాలు తెలుసుకోవలసిన అవసరము వున్నది. లేదా ప్రతి సంవత్సరము సహకారసంస్థలు కొన్ని Sinking fund, Redemption fund గురించిన లెక్కలు వేరే వ్రాయించుకొని write off చేయించుకుంటున్నారు. అంటే రానటువంటి లెక్కలక్రింద కొంత write off చేయవలసి వున్నదని కొంత సొమ్ము చూపించుతారు. అటువంటి మొత్తము ఏమైనా వున్నదా? వుంటే ఎంత? ఇప్పుడు మేము ఆ వివరాలు అడగకపోతే, అటువంటి లెక్క లన్నింటికి మేము ఒప్పుకున్నట్లే ననిన్నీ, మీరు చేశారు కాబట్టి, మమ్ములను ఒప్పుకోమనీ అంటారా? పూర్వము మెంబర్లు మారేది లేదు. మెంబర్లలో మార్పు, వగైరా, యీ పాలసీ, యీ బిల్లులో పొరబాటు వున్నది. అది నేను యిప్పుడు చెప్పను. ఏ ఏ బ్యాంకులో ఎంతెంత డిపాజిట్లు వేసింది చెప్పాలి. ఈ వగైరా వివరాలు ఏమీలేకుండా యీ రోజున యీ బిల్లు తెచ్చి, వెంటనే దీనికి మీరు ఒప్పుకోండి అని అంటే, మమ్ములను మీరు అడిగారు కాబట్టి యీ బిల్లును పరిశీలించకుండా మొత్తముగా ఒప్పుకోమంటారా? ఏమీ తెలియకుండా మమ్ములను ఎట్లా ఒప్పుకోమంటారు? అసలు మాకు యీ అనుమానం శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు ఆంధ్ర స్టేటు బిల్లు సమయంలో తెచ్చిన ప్రసక్తివల్ల కలిగింది. ఆ అనుమానం మాకు తీరలేదు. ఒకవేళ శ్రీ విశ్వనాథం గారికి తెలిసివుండబట్టి సమ్మతించవచ్చు. వారికి తెలిసినందువల్ల మమ్ములను సంతృప్తిపడమంటారా? యీ బిల్లుకు సంబంధించిన వివరాలన్నీ యివ్వమని కోరుతున్నాను. వివరాలు యివ్వకుండా మమ్ములను యీ బిల్లును ఆమోదించమంటే, ఆమోదించటానికి వీలులేదని అంటున్నాను. ఈ బిల్లును వివరాలతో సహా సెలెక్టు కమిటీలో చర్చించవలసిన ఆగత్యము వుంది. కాబట్టి యీ బిల్లును select committee కి పంపించవలసినదని కోరుతున్నాను.

1st December 1953]

Sri T. LAKSHMINARAYANA REDDI: Sir, I second the amendment.

Mr. SPEAKER:—The motion is: "That the bill be referred to a Select Committee."

The Hon. Sri D. SANJIVAYYA: To avoid further discussion which I think would be unnecessary, I would like to make a statement. (Hon. Members: Speak in Telugu) That I will do.

అధ్యక్షా, ఈ సహకారసంస్థలు విభజించాలనే వుద్దేశ్యముతో ప్రభుత్వమువారు జారీచేసిన ordinance లోనే ఒక clause వున్నది. ఇంతకుముందు గౌరవసభ్యులు మాట్లాడినది అంతయు చూస్తే అనేక విషయాలు కన్పిస్తున్నవి. అంటే ఈ ordinance యీ State కు అన్వయించదని అన్నట్లు కనబడుచున్నది. అది పొరబాటని అంటున్నాను. Ordinance లోని 4, 5 section ప్రకారము ఏ వైనా పంపిణీలలో తగాదాలు వచ్చినప్పుడు Justice Grane నామినేటు చేసిన ఒక Judge యొక్క award గా తీసుకోవాలి, అని వారు యిచ్చిన తీర్పుకు యిరుపక్షాలవారు బద్ధులై వుండాలని యిచ్చారు. అటువంటప్పుడు సహకారోద్యమంలో అనుభవమును గణించిన శ్రీ ప్రగడ కోటయ్యగారే యీ విధంగా విమర్శించి మాట్లాడుతున్నారంటే నాకు ఆశ్చర్యము కలిగిస్తున్నది. ఈ సహకార సంస్థలు autonomous bodies అని వారికి తెలుసును. తెలిసియుకూడా వారు అట్లా అంటున్నారంటే నాకు ఆశ్చర్యము కలుగుతున్నది. Joint సమావేశములో అక్కడ యీ ప్రజలు యీ విభజనకు సంబంధించిన విషయాలన్నియు పెట్టవలసి యున్నది. అవి ఏకగ్రీవముగా ఆమోదించినట్లైతే అప్పటినుంచి ఆ తీర్మానము అమలు జరిపించాలనే ఉద్దేశ్యము వున్నది. అక్కడ భేదాభిప్రాయములు వచ్చినప్పుడు ఆ విషయము తీర్మానించుటకు High Court Judge ముందు పెట్టాలని వున్నది. అయినప్పటికీ యిటువంటి తగువులు యెప్పుడును రాలేదు. అన్ని విషయములు ఏకగ్రీవముగా తీర్మానించ బడ్డాయి. ఆంధ్రులకు రావలసినవి రాకపోయినప్పటికీ, మనదేశములో వున్న సహకారోద్యమము సరిగా పనిచేస్తూవుండాలి. మనకు legitimate గా రావలసిన ఆస్తులు కాని అప్పులుకాని తేల్చుకున్నాము. అందులో అన్యా

[Sri D. Sanjivayya] [1st December 1953

యము యేమియు జరుగలేదు. కాబట్టి అటువంటి ordinance మన రాష్ట్రములోగూడా అమలులో పెట్టటము నాకు ముఖ్యముగా కన్పిస్తున్నది. ఈ విషయములన్నియు approve అయినతరువాతనే, మీాముందు పెట్ట బడినవి. కాబట్టి దీన్ని ఆమోదించగోరుతున్నాను. నేను యిప్పుడు మనవి చేసేది ఏమిటంటే, ఇవి అన్నియు autonomous bodies గనుక ఆ స్తి అప్పులు ఎంచడములో యీ autonomous bodies కు హక్కువున్నది. అందువల్ల యీ బిల్లును select committee తో నిమిత్తము లేకుండా ఏకగ్రీవంగా అమోదించ గోరుతున్నాను.

Sri K. KRISHNA RAO:—అధ్యక్షా ! యీ బిల్లు యీ రోజు ఎందుకు తీసుకురావలసివచ్చిందో మనం తెలుసుకోవాలి. యింతకుముందు Madras Provincial Co-operative Bank ఒకటి ఉండేది. ఆ బ్యాంకు వుమ్మడిరాష్ట్రంలోని జిల్లా Co-operative Central Bank కు లన్నిటికీ అప్పుల నిచ్చేది. రాష్ట్ర విభజన జరగడంవల్ల, అంతకుముందే ఆంధ్ర రాష్ట్రానికి, ప్రత్యేక రాష్ట్రబ్యాంకు వుండాలనే ఆందోళనవల్ల, ప్రత్యే కంగా ఆంధ్ర Provincial Co-operative Bank ఏర్పాటు చేయవలసి వచ్చింది. అనగా, ఒక Bank ను రెండుముక్కలుగా విభజించి, ఒకటి Andhra Provincial Co-opertive Bank అని, రెండవది Residuary State Co- operative Bank అని విభజింపవలసి వచ్చింది. కాని సహ కార సంఘాల చట్టం ప్రకారం ఒక సహకార సంఘాన్ని, రెండుగా విభ జించ వలసి వచ్చినప్పుడు, ఆ సంఘం general body వారు సమావేశమై ఏవిధంగా సంఘాన్ని విభజించాలి, ఏవిధంగా Assets and Liabilities విభజించాలి అనే విషయం నిర్ణయించాలి. యిది సహకార సాంప్రదాయం. కాని యిచ్చట ఆ విధంగా జరిగిందా అని మనం చూడాలి. మినిష్టరు గారేమో సహకార సంఘాలు autonomy అంటూ ఏమో చెప్పారు. వీరు యీ autonomy గూర్చి చెప్పేమాటలు కేవలం బూటకం. ప్రజలను మభ్యపెట్టేందుకుమాత్రమే వినియోగపడతాయి. యీ విష యమే యీ బ్యాంకు విభజనలోకూడా జరిగింది. ఎందుకంటే, యీ విభజన చెయ్యవలసినది general body కాని రిజిష్ట్రారు కాదు. కాని యిప్పుడు జరిగింది ఏమిటి? రిజిష్ట్రారు ఏవో proposals యిచ్చారు. యీ proposals ను accept చేస్తే చెయ్యండి లేకపోతే High Court

1st December 1953] [Sri K. Krishna Rao]

Judge ముందుపెట్టి, వారి నిర్ణయం తెప్పిస్తాము అని బెదిరించినట్లు, మీరు యిట్లు చెయ్యకపోతే High Court చేత confirm చేయిస్తామనే టట్లుగావుంది.

The Hon. Sri D. SANJIVAYYA:—On a point of order, Sir, the hon. Member is making a statement that a High Court Judge will act according to the instructions given by the Government. It is not so.

Sri K. RAJAGOPALA RAO:—ఈ ఆక్షేపణ సరియైనది కాదని మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER:—Please take your seat.

Sri K. KRISHNA RAO:—నేను చెప్పేదేమంటే — High Court కేవలం రిజిస్ట్రారు చెప్పిన దానిని O. K. చేయవచ్చు, చేయక పోవచ్చు. ఒకవేళ చేస్తే, రిజిస్ట్రారు నిర్ణయమే ఖాయమవుతుంది. ఈ తగ వంతా ఎందుకు; రిజిస్ట్రారు చెప్పినదే మనం నప్పుకుంటే, యింతటితో యిదంతా ముగిసిపోతుందని, general body వారు రిజిస్ట్రారు చెప్పిన, proposals ఒప్పుకునేటట్లు చేయడానికి వత్తిడి కల్గించడం, యిప్పుడు నియమించిన విధానంలో యిమిడి వుంది. యీ విధంగా రిజిస్ట్రారు చెప్పిన proposals కు ఒప్పుకోవలసిన అగత్యం ఏర్పడినందువల్ల కొన్ని పరిస్థితులు ఏర్పడ్డాయి. అందువల్ల ఏమయిందంటే, ఆంధ్రా ప్రావిన్షియల్ కోఆపరేటివ్ బ్యాంకుకు డిపాజిట్లు లేవు. అప్పులు మాత్రం వచ్చాయి. కల్లుకు జరిగిందేమంటే, వాళ్ళదగ్గర డిపాజిట్లు లేవు గాని ప్రోనోట్లు మాత్రం మిగిలాయి. అడిగితే జిల్లా కోఆపరేటివ్ బ్యాంకులవద్ద నుంచి రావలసిన డబ్బు వసూలుచేసుకోండన్నారు. మొన్న ఏలూరు కోఆపరేటివ్ బ్యాంకు Silver Jubilee ఐనప్పుడు రిజిస్ట్రారు సుబ్రహ్మణ్యం నాయుడుగారు మాట్లాడుతూ మనదగ్గర డబ్బు లేదు, మీరు వసూలుచేయండి అన్నారు. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఆ పరిస్థితులలో ఏమి చేశారని అడుగుతున్నాను నేను. జిల్లా కోఆపరేటివ్ బ్యాంకులు మా దగ్గర డిపోజిట్లు లేవు, రాష్ట్ర కోఆపరేటివు బ్యాంకు అప్పు యిస్తేగాని మా సంఘాలకు మేము అప్పులు యివ్వలేమని అంటు న్నాయి. ఇక ప్రజలనుండి డిపాజిట్లు సేకరించాలి. డిపోజిట్లు సేకరించా

[Sri K. Krishna Rao] [1st December 1953

లంటే ప్రజల మన్ననలు పొందాలి. ఆంధ్రలోని కోఆపరేటివ్ బ్యాంకులు ఇక్కడ ఉండే రైతాంగం యొక్క సమిష్టి యోగక్షేమాల నాలోచించకుండా ఉండే సాంప్రదాయం ఏర్పడింది. అందువల్ల ఎక్కువగా డిపోజిట్లు రావడం లేదు. డిపోజిట్లు రాకపోవడంచేత అప్పులు ఇవ్వడంలేదు. రాష్ట్రం bifurcate కావడంవల్ల యీ విధమైన చిక్కులు ఏర్పడ్డాయి. యింతే కాదు మనకు బళ్ళారి జిల్లా పోయింది. ఆందులోని మూడు తాలూకాలు మాత్రమే మిగిలాయి. అందులో ఆదోని, ఆలూరు రెండు తాలూకాలూ కర్నూలు district బ్యాంకుకు చేర్చబడ్డాయి. ఒక తాలూకా రాయదుర్గం బ్యాంకు అనంతపురం జిల్లాకు వచ్చింది. ఒక రాష్ట్ర సంస్థను మీరు రెండుముక్కలుగా విభజించారంటే ఎంత ఆస్తి పంచుకోవాలో, ఎంత అప్పు పంచుకోవాలో అనే విషయంలో—ఒక ఇల్లు పంచుకొనుటలో ఎలాంటి తగాదా వస్తుందో అలాంటి తగాదాయే యీ బళ్లారి తాలూకాలలోని సహకార సంఘాల విషయంలో వచ్చింది. ఈ విషయం సంతృప్తి కరంగా పరిష్కారం కాలేదు. మద్రాసు రాష్ట్ర కోఆపరేటివ్ బ్యాంకు నుంచి విడిపోయి పంచుకొనుటలో తగాదాలు ఎట్లా వచ్చాయో, అట్లాగే ఇక్కడ కూడా రాయదుర్గు, ఆలూరు, ఆదోనీ తాలూకాల విషయంలో కూడా తగాదాలు వచ్చాయి. బ్యాంకులు అప్పులు ఇవ్వడం లేదు. వ్యాపారం స్థభించిపోయింది. జిల్లా బ్యాంకు వ్యవహారాలుకూడా స్థంభించిపోయాయి. ఎట్లా కనబడుతోందంటే—కేవలం registrar పెత్తనం క్రింద యీ సహకార సంఘాలను వుంచడం వల్ల స్థంభన ఏర్పడింది. ఎన్ని deposit లు, ఎంత ఆస్తి, ఎంత cash రావాలో చూచుకోకుండా విడిపోవడంవల్ల ఆంధ్రా కోఆపరేటివ్ బ్యాంకుకు, ఆంధ్ర జిల్లాలలో యుండే co-operative institutions కు చాలా దెబ్బతగిలింది. ఈ problem రాష్ట్ర కోఆపరేటివ్ బ్యాంకుకే గాక, రాష్ట్ర చేనేత సహకార సంఘానికి గూడా ఎక్కువగా వర్తిస్తుంది. ఏ మంటే వాటా పంపకంలో unsold stocks ఎక్కువగా ఆంధ్రలోని కోఆపరేటివ్ సొసైటీకి ఇచ్చి చాలా అన్యాయం చేశారని తెలుస్తోంది. ఈ విషయాలు పరిశీలించాలి. పరిశీలించకుండా యీ విషయాలపై మేము నిర్ణయం యిచ్చుట సరిగాదు. మంత్రులు తమ బాధ్యతలు నిర్వహించినప్పుడేకాని ఈ విషయాలు సరిగా పరిష్కారం కావు. మంత్రులు తమ బాధ్యతలు నిర్వహించనప్పుడు, Legislative Assembly కూడా తన బాధ్యత నెరవేర్చకుండా ఉండడం సరియైన పని

1st December 1953] [Sri K. Krishna Rao]

కాదు. నేను ప్రభుత్వానికి చెప్పేదేమంటే, మీరు ఈ పని చేయకపోతే మేము చేస్తాం. మీరు నిద్రపోతూ ఉంటే ఖచ్చితంగా ఈ పని మేము నెరవేరుస్తాం. ఈ నాడు registrar పెత్తందారుగా తయారైనాడు. ఆంధ్రా కోఆపరేటివ్ బ్యాంకుకు ఎటువంటి అన్యాయం జరగకుండా మనం చూడాలి. ఈవిషయం select committee వారు ఆలోచిస్తారు. ఆర్డి నెన్సుఉంది. Take it or leave it అని అడగడం శాసనసభను అగౌరవం చేసినట్లవుతుంది. We demand investigation. మాకు తలలు లేవా ? మేమూ చదువు కొన్నాం కాదా ? ఈ వివరాలు సేకరించాలి. సుబ్రహ్మణ్యం నాయుడు గారి ఏలూరు ఉపన్యాసం చూస్తే, ఆంధ్రా కోఅపరేటివ్ బ్యాంకుకు చాలా అన్యాయం జరిగిందని తెలుస్తోంది. ఏ విధంగా అన్యాయం జరిగిందో— దీన్ని ఎల్లా ఒప్పుకుంటాము ? పరిశీలించుటకు select committee సరి యైన మార్గం. దీన్ని గురించి మీరు చర్చించకపోతే మేము మా ధర్మం నిర్వహిస్తాం.

The Hon. Sri D. SANJIVAYYA:—నేను ఇదివరకే మనవి చేశాను. మీకు తలకాయ లేకపోతే మాకు లేదా అని అడుగుతున్నారు. తలకాయలు అందరికీ ఉన్నవి. సర్వసభ్యసమావేశంలో యున్నవారికీ తలకాయ లున్నవని మనవి చేస్తున్నాను (Hear, hear) 11-15 a.m.

* Sri P. VENKATASUBBAYYA:— అధ్యక్షా ! ఇక్కడ జరుగుచున్న విషయం ఏమిటంటే State Co-operative Bank, State Co-operative Handloom Weavers Society, State Co-operate Land Mortgage Bank ఉన్నవే, వాటిని విభజనచేసే విష యంలో నేల విడిచి సాము చేసినట్లుగా మిత్రులు మాట్లాడుతున్నారు. కోఆపరేటివ్ సొసైటీల ఆక్టులో co-operative societies' amalgamation and bifurcation అని 13వ Section ఉన్నది. అసలు co-operative societies ఎట్లా form అవుతాయనే విషయం మిత్రు లకు సమగ్రంగా తెలియనట్లున్నది. జిల్లాలలో ప్రైమరీ co-operative society లు ఉంటాయి. వాటి ప్రతినిధులతో మహాసభ ఏర్పాటవుతుంది. మహాజన సభలో కొంతమంది director లను ఎన్నుకుంటారు. ఆ విధంగా ఏర్పడిన director లు, president లు, secretary లు వాటిని సక్ర మంగా నడిపేటట్లు చూచుకుంటారు. అంతేకాని ఆ విషయంలో గవర్న

[Sri P. Venkatasubbayya] 1st December 1953

మెంటుకు బాధ్యత లేదు. గవర్నమెంటు బాధ్యత ఎంతమాత్రమంటే ఆడిటు జరిపించి సొసైటీలు సక్రమంగా జరుగుచున్నవా లేదా అని చూడడము మాత్రమే. Co-operative Societies Act VI of 1932 క్రింద ఈ అధికారము యివ్వబడియున్నది. ఈ ఆడిటులో సొసైటీలు సక్రమంగా జరగక, మోసం చేస్తున్నారని తెలిస్తే చట్టం క్రింద చర్య తీసుకుంటారు. అక్కడ ఉండే ఆర్థిక పరిస్థితులకుగాని, జరిగే వ్యవహారాలకు గాని ప్రభుత్వానికి బాధ్యత లేదు. మహాజనసభ amalgamation and bifurcation Section క్రింద ఆస్తి, అప్పులు పంచునపుడు కూడుతుంది. ఆ సభవారు shares ఎంత కట్టారు? నిధులు ఏమి ఉన్నాయని దృష్టిలో పెట్టుకుని విభజన చేస్తారు. మహాజనసభకు సర్వాధికారాలు ఉన్నవి. ప్రభుత్వం మహాజనసభను ఇట్లా చెయ్యాలి అని చెప్పుటకు వీలులేదు. కష్ట నిష్ఠూరాలు కల్గితే తీర్పు చెప్పటానికి జడ్జికి ఆర్డినెన్సు క్రింద అధికారం ఇచ్చారు. సామాన్య పౌరులు ఒక జడ్జి తీర్పుపై హైకోర్టుకు అపీలుకు ఎట్లాపోవచ్చునో అట్లే ఈ సంఘాలుకూడా appeal కు పోవచ్చును. అప్పుడు వారు నిర్ణయం చేస్తారు. అంతేకాని ప్రభుత్వం జోక్యం కల్గించుకొనుటకు వీలులేదు. Co-operative Land Mortgage బ్యాంకు debentures అమ్ముతుంది. Debentures ను float చెయ్యడానికి అధికారం ఉన్నదా? ఎంత float చేయవచ్చును? ఎంత విలువగల మార్టిగేజీలు సెంట్రలు మార్టిగేజీ బ్యాంకు వశములో ఉన్నవి? అని ప్రభుత్వం చూసుకుంటుంది. ఈ గ్యారంటీ ప్రకారం సంఘాలు నడుస్తూ ఉంటాయి. ప్రజాస్వామిక సంస్థలు అని ఏర్పడిన తరువాత మహాజనసభకు సర్వాధికారాలు ఉంటాయి. ఆస్తి, అప్పులు పంపకం చేసుకునే విషయంలో మహాజనసభకు అధికారం ఉంటుంది. ఇక్కడ వివరాలు పెట్ట నవసరం లేదు.

11-20 a.m. (At this stage the Deputy Speaker occupied the Chair)

పరిపాలనా విషయంలో ఏమైనా అవకతవకలు వుంటే Co-operative Societies Act లో తగు సవరణలు తీసుకు రావచ్చునేగాని, ప్రస్తుతం సహకార సంస్థలకు వుండే హక్కులలో జోక్యం కలుగచేసుకోడం సాధ్యం కాదని మనవి చేస్తున్నాను.

**Mr. DEPUTY SPEAKER :—** గౌరవ సభ్యులు సభను disturb చేయవద్దని కోరుతున్నాను.

1st December 1953]

Sri P. VENKATASUBBAYYA :—పరిపాలన సక్రమంగా జరగడం లేదని అంటే చట్టాన్ని సవరణ చేయడానికి శాసన సభకు అధికారం వున్నదనీ, ఆ చట్టాన్ని సవరించడానికి ప్రభుత్వం తలపెట్టినప్పుడు తగు సవరణలు తీసుకు రావడానికి గౌరవ సభ్యులు ప్రయత్నించవచ్చుననీ మనవి చేస్తున్నాను. రిజిష్ట్రారు అధికారంక్రింద ఆస్థి అప్పుల విభజన జరుగుతోంది అని శ్రీ ఖండవల్లి కృష్ణరావుగారు చెప్పియున్నారు. ఆయన జిల్లా కోఆపరేటివ్ సంస్థకు Secretary గా చాలాకాలంగా వున్నారు. ఈ విషయం ఆయనకు ఎందుకు తెలియదో నాకు అర్థం కాకుండా వున్నది. ఈ విషయం మహాజనసభకు సంబంధించినదేకాని రిజిష్ట్రారుకు సంబంధించినది కాదు. అక్కడ రిజిష్ట్రారు సలహాదారుగా మాత్రమే పనిచేస్తారు. ఈ విభజన అయిన తరువాత ఊరికే సూత్రప్రాయంగా ప్రభుత్వం ఆమోదించవలసి వుంటుంది. ఈ విషయంలో తర్జన భర్జనలు అవసరంలేదనీ, ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపనవసరం లేదనీ మనవి చేస్తున్నాను.

Sri K. KRISHNA RAO:—నాకు మరొక విషయంకూడా తెలుసును. రిజిష్ట్రారు ముందర Directors ఎలా వుంటారో, రిజిష్ట్రారు proposals ను వారు ఏ విధంగా obey చేస్తారోకూడ నాకు తెలుసును.

The Hon. Sri D. SANJIVAYYA :— ఈ సభలోకూడా కొందరు Directors వుండవచ్చునని, Directors రిజిష్ట్రారు చెప్పిన పని చేస్తారని అనడం మర్యాద నతిక్రమించడం అనుకుంటాను.

Sri K. SUBBA REDDI :— నేను Co-operative Societies గురించి కొన్ని విషయాలను మాత్రమే మంత్రిగారి దృష్టికి తీసుకురావలిచాను. ముఖ్యంగా మా గుంటూరుజిల్లా సహకారసంస్థ కొరతలోవున్నది. దానికి బాధ్యులు ఎవరు; వారిమీద ప్రభుత్వం ఏ విధమైన వైఖరి అవలంబిస్తోంది? దాన్ని ప్రభుత్వంయొక్క సహకారంతో bad debts క్రింద cancel చేసుకునేందుకు ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలుస్తోంది. ఇప్పుడువున్న president గారు దివాలా తీసే స్థితిలో వున్నారు. మా తాలూకాలో దాదాపు 20, 30 credit societies వున్నాయి. వారికి ఇష్టమైన 4, 5 society లకు ఒక్కొక్కదానికి లక్షా 50 వేల రూపాయల చొప్పున

[Sri K. Subba Reddi] [1st December 1953

sanction చేశారు. ఇందులో వసూలయే సొమ్ము తిరిగి 10, 15 వేల కంటెలేదు. ఒక గుడిసె వుంటుంది. దాని విలువ ఒక 50 రూపాయలు వుంటుంది. దానిమీద 400 అప్పుచొప్పున తమ అనుకూలురకు ఇచ్చి నారు. ఈ విధంగా వారి అభిమానాలు సంపాదించు కొన్నారు.

Mr. DEPUTY SPEAKER :— గౌరవ సభ్యులు subject మీద మాట్లాడుతున్నారా ?

Sri K. SUBBA REDDI :—General discussion అని మాట్లాడుతున్నాను.

Mr. DEPUTY SPEAKER :— ప్రస్తుత విషయం మీద మాట్లాడండి.

Sri K. SUBBA REDDI :— ఈ విషయంలో మంత్రిగారికి మద్రాసు శాసనసభలో వుండగా చెప్పాను. తిరిగి వారిదృష్టికి తీసుకువచ్చే ఉద్దేశ్యంతో general discussion లో నా పేరు ఇచ్చాను. నా అభిప్రాయాలు చెప్పడానికి నాపేరు చదివారు అనుకుంటాను. వెంటనే ఈ విషయం పరిశీలించి, అధ్యక్షపదవినుంచి ఆయనను తొలగించి తగుచర్య తీసుకోవాలి అని కోరుతున్నాను. Bad debts క్రింద treat చేయడానికి ప్రయత్నిస్తున్నందువల్ల ఈ fraud ను గూర్చి తగు విచారణ వెంటనే జరిపించాలని కోరుచున్నాను.

(At this stage the Speaker resumed the Chair.)

Sri C. V. K. RAO :—అధ్యక్షా, ఈ బిల్లు చాలా సంధిగ్ధంగా వుందని నా మొదటి విమర్శ. మన గవర్నరుగారు తీసుకువచ్చిన యీబిల్లు సంబంధపు ఆర్డినెన్సు యీ సమావేశము ముందు ఎందుకు పెట్టలేదు ? అట్లా పెట్టకుండా ordinance క్రింద చేసిన చర్చను ఈ బిల్లుద్వారా ఆమోదింప వలసిందని ప్రభుత్వమువారి ఉద్దేశం. అసలు ఆ చర్చ ఎందుకు తీసుకోవలసి వచ్చిందో తెలియదు. బహుశా ఏ శాసనసభలోను ఇటువంటిబిల్లు వచ్చివుండదు అనుకుంటాను. సభ్యులు జాగరూకతతో లేని పరిస్థితుల్లో ఇటువంటిబిల్లు ప్రవేశపెట్టడానికి సాహసించవచ్చునేమో; కాని ప్రత్యేకంగా

1st December 1953] [Sri C. V. K. Rao]

రాష్ట్రానికి మూడు co-operative institutions కు సంబంధించిన బిల్లు ప్రవేశపెట్టినపుడు పూర్తి వివరాలు లేకుండా legislature దీన్ని pass చేయాలని కోరడం సబబైన విషయంకాదు. Democratic పద్ధతిలో ఏర్పడిన co-operative society directors మొదలైనవారు కొన్ని నిర్ణయాలు చేశారు, వాటిని ప్రభుత్వం పరిశీలించింది. వాటిని మీరు ఆమోదించండి అని ఈ నాలుగు పేజీలకాగితం మీముందు పెడుతున్నాం అని మంత్రిగారు చెప్పారు. ఇందులోవుండే 3 వ సెక్షనుబట్టి Andhra Central Co-operative Bank, Andhra Central Land Mortgage Bank and Andhra State Handloom Weavers Co-operative Society అను మూడు సహకారసంస్థలు ఏర్పడినాయి. దీంట్లో వున్నటువంటి shareholders, creditors అందరి తరఫున మీరు ఏమిటి చేశారు? ఇవన్నీ కలగూరగంపగా వున్నవాటిని pass చేయడం, యీనాడు వందలాది creditors, shareholders తరఫున ఒక శాసనం చేయదలచుకొన్నాం అన్నమాట. హక్కులగురించి, డబ్బుగురించి శాసనం చేయదలచుకున్నాం అన్నమాట. ఇది సులువుగా ఆలోచించకుండా ఆమోదించమనడము సబబుకాదు. ఇది క్షుణ్ణంగా చూడాలని కోరుతున్నాను. అందుచేత Select Committee కి పంపాలని కోరుతున్నాను. అందుచేత యివన్నీ కూడా Select Committee ఒక report తయారు చేస్తే దానిసూచనపై చర్చించి మనం శాసనం చేయడం సబబుగా వుంటుంది. ఏదో ordinance చేశాం, pass చేయండి అనడం సబబుకాదని సద్భావంతో నేను చేస్తున్న విమర్శ. Shareholders, creditors కాకుండా ఒక autonomous body అని మంత్రిగారు అంటారు. అలాకాదని నా వాదన. Co-operative movement దృష్టిలో పెట్టుకున్నట్లైతే యీ బిల్లును పూర్తిగా విచారించుటకు ఒక Select Committee కి పంపడం సక్రమమైనపని అని నా వుద్దేశము.

Sri C. PULLA REDDI:— అధ్యక్షా, ఈ బిల్లు చర్చ సందర్భంలో ప్రతిపక్షం ఎందుకు Select Committee కి పంపమందో అని మంత్రిగారు కఠినమైన పదాలు వాడడం ప్రతిపక్షంలో వాడినైన నాకు ఆశ్చర్యంగావున్నది. ప్రతిపక్షం యీ విషయంలో అంగీకరించడంలేదు. Partition వచ్చినప్పుడు సమిష్టిమద్రాసును, ఆంధ్రరాష్ట్రానికి ఆస్తిపాస్తుల

[Sri C. Pulla Reddi] [1st December 1953

వివరాలు వీనిగురించి సమగ్రంగా అసెంబ్లీ సభ్యులముందు పెట్టాలి. Bank ల సమస్య, ఆంధ్రరాష్ట్ర Bank Ordinance pass చేశాం కాబట్టి Bill pass చేయండి అనడం సమంజసముగాలేదు. సమిష్టి మద్రాసు గవర్నమెంటు Bank ఆస్తి ఎంత? అప్పులు ఎంత? ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకంగా ఆస్తి ఎంత? అప్పు ఎంత? ఎంత ఆస్తి, అప్పు పంచుకున్నాం? ఎంత ఆర్థిక సుస్థిరత వున్నది? వివరాలు యివ్వమని చెప్పి అడుగుతున్నాను తప్ప ఆర్థికంగా Bank చేయడానికి వ్యతిరేకంకాదని చెబుతున్నాను. అప్పుల స్వరూపాలు ఆస్తుల స్వరూపాలు ఏవిధంగా వున్నాయి? వెనుక మద్రాసు గవర్నమెంటు సమిష్టిరోజుల్లో Congress నాయకులు అధికారంలోవుండే రోజుల్లో ఎన్నో తతంగాలు జరిగినాయి. ఆంధ్ర కాంగ్రెసు నాయకులు మంత్రివర్గంలోవుండి ఏవిధంగా భూములను తమయిష్టం వచ్చినవారికి రాజకీయ బాధితులకు యిచ్చారో, ఎంతమంది తమ యిష్టులను బ్యాంకులకు president లుగా నియమించారో, రాజకీయ లక్ష్యాన్ని సిద్ధించడానికి ఏమి చేశారో ఎవరికీ తెలియనివికాదు. గుంటూరు......

The Hon. Sri N. SANJEEVA REDDI:—కాంగ్రెసు వాడు లోకరేనా మీరు కూడా లేరా?

Sri C. PULLA REDDI:—మేము రంగంలోకి వచ్చింది యీ రోజు. 6 సంవత్సరాలు Congress అధికారంలో వున్నది. రాజకీయ ప్రయోజనాలకోసం తమ సుస్థిరతకోసం పదవులను బలి యిచ్చారు. ఆస్తి అప్పులు విషయంలో తతంగం అన్యాయం జరిగింది. ఆస్తికి గుండుసున్న చుట్టి అప్పులు పెంచారు అని చాలమంది చెబుతారు. మా ఆస్తి ఎంత, అప్పు ఎంత, ఏ ఏ bank లు ఏ ఏ పరిస్థితుల్లో వున్నాయి అనే వివరాలు అడగకుండా ప్రభుత్వం యీ బిల్లును ఎందుకు తెచ్చింది అని అడుగుతున్నాను. సమిష్టి general body మీటింగు జరిగింది అంటూ వున్నారు. Proposals పంపించాం అంటారు. సంతోషం. ఆస్తి ఎంత, అప్పు ఎంత అని యీనాడు అడుగుతున్నాం. గుంటూరు Central Co-operative Bank ఆస్తి ఎంత, అప్పు ఎంత, అని అడుగుతున్నాను. ఇవన్నీ పరిశీలించడానికి Bill ను Select Committee కి పంపాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

1st December 1953]

* The Hon Sri T. VISWANATHAM :—ఆంధ్రరాష్ట్ర విభజన సందర్భంలో ఏమి జరిగిందని శ్రీ పుల్లారెడ్డిగారు ప్రశ్న వేశారు. ఆ విషయంలో అనుమానం లేకండా partition కు కూర్చున్న రోజుల్లో యీ వ్యవహారం చెన్నపట్నంలో జరుగుతున్నప్పుడు watch dogs లాగ పనిచేసి వున్నాం. అది మనమంతా గమనించవలసి వున్నది. యీ మూడింటికి కూడా Combined State Presidents ఎవరో చూసినట్లయితే ఆంధ్రులకు రావలసినటువంటిది సరిగ్గా వచ్చిందో లేదో గమనించుకోవచ్చు. Land Mortgage Bank కు శ్రీ బిక్కిన వెంకటరత్నంగారు, రెండో వారు శ్రీ భోగరాజు వెంకట్రత్నంగారు, మూడో వారు సోమప్పగారు. ఈ ముగ్గురూగూడా ఆంధ్రులే. వారి అధ్వర్యాన్ని జరిగిన వ్యవహారంలో ఆంధ్రులకు అన్యాయం జరిగినదని అనుకునేందుకు అణుమాత్రం అవకాశం లేదు. ఈ co-operative institutions యొక్క పంపకం పరస్పరంగా వప్పుదల అయిన వ్యవహారంలో గవర్నమెంటు కలుగ జేసుకోరాదు. దీని యొక్క ఆర్డినరీ వ్యవహారం అంతాకూడా డైరెక్టరులే చూచుకుంటారు. ఒకప్పుడు గవర్నమెంట్ నిర్వహించవలసినది ఏదైనా వారు నిర్వహించక పోతే ఆ విషయం మనం ఈ సభలో ఆలోచించవలసి ఉంటుంది. ఇంత వరకు ఉంటూ వచ్చిన పెద్దలు అంతాకూడా మనవాళ్లే. కనుక మనకు ఎంత పట్టుదల ఉందో వాళ్లకుకూడా అంత పట్టుదల ఉంటుందని మనం కూడా గమనించాలి. రెండింటికి సంబంధించిన కాగితాలుకూడా పబ్లిష్ చేశాం. వాటియొక్క అసెట్స్ లైబలిటీస్ ఇప్పటికిప్పుడు కావాలంటే కష్టమైనటువంటి విషయం. కాని అవన్నీకూడా టైపైనాయి, అచ్చైనాయి. అవి మీ కందరకు సర్క్యులేట్ చేయబడతాయి. వారికి వీరికి తగాయిదా లేమీ లేవని వారుకూడా వచ్చి చెప్పారు. అయినా తరువాత వచ్చినటువంటి వారుకూడా తెలుగువారే ప్రెసిడెంట్లుగా ఉన్నారు. శ్రీ రమాకాంతరావు మొదలైన వారంతాకూడాను. కాబట్టి వారు వీరు దగ్గర కూర్చొని పని చేశారు. ఎవరు కూడా అనుమానించవలసిన అవసరం లేదు. Point raise చేశారు కాబట్టి గవర్నమెంట్ ఆ అంకెలన్నీ తెప్పించి మీకు అందరకు సర్క్యులేట్ చేస్తారని నేను మనవి చేస్తున్నాను.

* Sri VAVILALA GOPALAKRISHNAIAH:—అధ్యక్షా! నా amendment కు నేను జవాబు చెప్పాలని ఉంది.

[Sri Vavilala Gopalakrishnaiah] [1st December 1953

అసలు నా మనవి ఏమంటే దీంట్లో కొన్ని కొన్ని Banks ఉన్నాయి. Land Mortgage Bank, కో ఆపరేటివ్ బ్యాంక్ మీాద మద్రాస్ గవర్నమెంట్ హామీాలను ఇచ్చింది. తరవాత మన గవర్నమెంట్ వారు ఎంతవరకు హామీా ఇస్తారా అన్నది తేల్చుకోవలసి ఉంది. అందుచేత అవన్నీ తెల్చుకోకుండా ఓటు చేయమంటే ఎట్లా చేస్తాం ? చివరికి చెప్పేదేమంటే వాళ్లంతాకూడా ఒక అగ్రిమెంటుకు వచ్చారు. ఇప్పుడు మాట్లాడినవారిలో చాలామంది బైలా చదవలేదని అన్నారు. అందుచేత దీనికి సంబంధించిన వివరాలు తెలియకుండా అంకెలు ఇవ్వకుండా అంకెలు అడక్కుండా ఇన్ఫర్మేషన్ లేకుండా ఏమీా లేకుండా బిల్లును ఒప్పుకోమని మంత్రులు అడుగుతున్నారు. అసలు ఈ విషయంలో అనుమానాన్ని క్రియేట్ చేసింది ఆంధ్ర స్టేటు బిల్లు మద్రాసు రాష్ట్ర శాసనసభలో చర్చలో వుండగా శ్రీ విశ్వనాథంగారే, దీని ఫలితంగా మనం చాలా దెబ్బతిని పోతాం అని చెప్పారు. ఇప్పుడు మంత్రిగా అన్ని విషయాలు తెలుసుకున్నాం కాబట్టి మమ్మల్ని సంతృప్తిపడమంటారు. వారు అనుమానపడితే మమ్మల్ని అనుమాన పడమంటారు. ఇపుడు వారు సంతృప్తి చెందారు కావున మమ్మలను సంతృప్తి పడమంటే ఎట్లా? వారు అంకెలతో సంతృప్తిపడి, మాకు ఆ అంకెలు చూపకుండానే మమ్మల్ని మాటలతో సంతృప్తి పడమని మంత్రి విశ్వనాథంగారి అభిప్రాయం. అందుచేత వారు ఈ విషయంలో assurance ఏదైనా ఇస్తే దానిమీాద సవరణ ఉపసంహరించు కోవడమో లేక ప్రెస్ చేయడమో జరుగుతుంది.

Mr. SPEAKER :—I am taking the sense of the House on this amendment. The question before the House is:

"That the Bill be referred to a Select Committee".

The amendment was lost.

Mr. SPEAKER :—The question is: "That the Bill be taken into consideration at once."

The motion was carried.

Mr. SPEAKER :—Now, I will take up the Bill clause by clause.

CLAUSES 2, 3 and 4.

Clauses 2, 3 and 4 were put and carried.

1st December 1953]

Mr. SPEAKER :—Clause 1 : The motion before the House is : "That clause 1 do stand part of the Bill."

Now, Sri Vavilala Gopalakrishnaiah will move his amendment to the clause.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Mr. Speaker, I move the following amendment : "This Act may be called the Andhra State Co-operative (Reconstitution and Formation) Act, 1953."

దీనిని గురించి ఎక్కువగా మాట్లాడుటకు రాలేదు. ఇప్పుడు యీ amendment రెండవసారి పరిశీలన జరిగే సందర్భంలో యీ విధంగా వుండాలని కోరుతున్నాను. "1953 ఆంధ్రరాష్ట్ర సహకార పునర్నిర్మాణ బిల్లు" దీనికి పై విధంగా పేరుపెట్టాలని, నా యీ సవరణను ఆమోదించాలని కోరుతున్నాను.

The Hon. Sri D. SANJIVAYYA :—Sir, I accept the amendment.

The amendment was carried.

The clause as amended was put and carried.

The Preamble was put and carried.

The Hon. Sri D. SANJIVAYYA :—Sir, I move: "That the Andhra State Co-operative (Reconstitution and Formation) Bill, 1953, be passed into law."

Mr. SPEAKER :—The motion before the House is: "That the Andhra State Co-operative (Reconstitution and Formation) Bill, 1953, be passed into law."

* Sri K. KRISHNA RAO:—అధ్యక్షా, దీనిలో శ్రీ విశ్వనాథం గారు యివి Autonomous Bodies అనిన్నీ, వాటికి సంబంధించినదంతా మనం ముఖ్యంగా చేయనవసరం లేదని చెప్పారు. కాని ఆంధ్రరాష్ట్రం ఏర్పడినతర్వాత ఇప్పుడు ఆంధ్రదేశానికి మొట్టమొదటి సారిగా సహకార చట్టం చేస్తున్నాము. ఆంధ్రదేశములో సహకారోద్యమానికి ఘనమైనచరిత్ర, సాంప్రదాయాలు వున్నాయి. ఈ ప్రాంతాలలో కీ. శే. రామదాసుపంతులుగారు, గురుమూర్తిగారు మొదలైన గొప్పగొప్ప నాయకులు, చాలకాలము యీ కో-ఆపరేటివ్ ఫీల్డులో పనిచేసి అనుభ 11-52 a.m.

[Sri K. Krishna Rao] [1st December 1953

వమును సంపాదించిన నాయకులు. డిపార్టుమెంటు ఆఫీసర్ల యొక్క పెత్తనం సహకార సంస్థలమీద వుండకూడదని, వారు హోరాహోరీగా దెబ్బలాడారు. అది బహుశః హిందూదేశంలో మిగతా ప్రాంతాలలో జరుగని, ఆంధ్రలో ప్రత్యేకంగా జరిగిన, జరుగుతూన్న విషయం. రిజిష్ట్రారు చెప్పినదంతా మనం పాటించాలనేటటువంటివి, మనం తిరిగి వారి యొక్క పెత్తనాన్ని అంగీకరిస్తామని, వారి చెప్పుచేతలలో నడుస్తున్నామని, అందువల్ల సహకార సంఘాలే రిజిష్ట్రారు చేతులలో కీలుబొమ్మలయినాయని, యీ విషయం ముఖ్యంగా యిప్పుడు కేవలం సహకార శాఖోద్యోగులే చెప్పుచున్నారు. సహకారసంఘాలమీద, సంస్థలమీద పరిపాలనాధిక్యత కావాలని రిజిష్ట్రారు చెప్పేదాన్ని మన ఆంధ్రలోని సహకారులు హోరాహోరిగా ఎదుర్కొని దెబ్బలాడారు. ఆంధ్రలో సహకార ప్రజాతంత్ర నిలకడ వుండాలని, ప్రజాతంత్ర పద్ధతులతో నడపబడాలని, ఆంధ్ర సహకారులు మొదటినుండి ఘోషించారు. ప్రజలు యీవుద్యమంపై నేడు శ్రద్ధతీసుకోకుండా వుండినట్లైతే, సహకార సంఘాల పరిపాలన రిజిష్ట్రారు చెప్పుచేతలలో వుండిపోతుందని ఆంధ్రసహకారులు చెప్పిన విషయం. ఇంకొక చెప్పుకోతగు విషయమేమిటంటే ఆంధ్రలో యీ విధంగా సహకార ప్రజాతంత్రతకు పోరాటం సాగించడంలో, ఆంధ్రదేశము అగ్రస్థానం వహించింది. హిందూదేశంలో, యింతగొప్ప ప్రజాతంత్ర పోరాటం యితర రాష్ట్రాలలో మనకు ఎక్కువగా కనిపించదు. ఈ విషయంలో ఆంధ్రదేశం అగ్రస్థానాన్ని వహించినందున ఆంధ్రులే భారతదేశానికంతకు సహకార వుద్యమానికి నాయకులను కల్గించారు. యావత్ భారతదేశానికి ఆంధ్రులే సహకార నాయకులుగా వుండినారు. అందుచేత ఆంధ్రులు సాగించిన ప్రజాతంత్ర పోరాటం భారతదేశంలోని అందరి సహకారుల మన్ననకు, ప్రశంసకు కారణమైనది. ఇటువంటి నాయకులను, సహకారోద్యమంనుండి తరిమివేసి, డిపార్టుమెంటు యొక్క నియంతృత్వంక్రింద వుద్యమాన్ని తమ గుప్పిటలో పెట్టుకోడానికి, ప్రభుత్వం 1939 నుండి ప్రయత్నించింది. ఆ ప్రయత్నాలతో అప్పుడు సహకారోద్యమంలో రాష్ట్రబ్యాంకు అధ్యక్షులుగా వుద్యమంలో ప్రముఖులుగా ఉన్న రామదాసు పంతులు గారిని, వుద్యమంనుండి వేరుపర్చారు. ఆ ప్రయత్నాలలోనే, డాక్టరు గురుమూర్తి మొదలగు ప్రజాతంత్ర సహకార నాయకులనుకూడా వుద్యమంలో లేకుండా ప్రభుత్వం, అధికార్లు కుట్రలు సాగించారు.

ఏ కుట్రలవల్ల, ఏవిధంగా, రామదాసుపంతులు, డాక్టరు గురుమూర్తి మున్నగువారిని సహకారోద్యమంనుండి తరిమివేసి, వుద్యమాన్ని ప్రజాతంత్ర వుద్యమంగా అభివృద్ధికాకుండా చేశారో, ఆ కుట్రలే, ఆ పన్నాగాలే యీ రోజువరకు అమలులోవున్నాయి. ఆ కుట్రలకు లోబడియే, యీ మద్రాసు ప్రొవిన్షియల్ కో-ఆపరేటివ్ బ్యాంకు పనిచేస్తూంది. దాని క్రిందనే శ్రీ బిక్కిన వెంకటరత్నంగారు కూడా అధ్యక్షులుగా వున్నారు.

ఇక యీ రిజిష్ట్రార్సు యిచ్చిన ప్రపోజల్సు విషయంలో యిక్కడ జరిగిన విషయం సాధారణంగా మున్సిపాలిటీస్‌లో జరిగేటట్టుగానేవుంది. కమిషనర్ వక నోటుపెట్టి దానిని, కౌన్సిల్ తోసివేస్తే, తిరిగి అదేనోటును గవర్నమెంటుచే అప్రూవుచేయుంచి, మున్సిపాలిటీస్ నెత్తిన రుద్దడం జరుగుతుంది. అదేవిధంగా సహకార సంఘాలలో డిపార్టుమెంటు పెత్తనం సాగుతూందని మనకు తెలుస్తూంది.

కాని యికముందు యిది జరగకూడదు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడడంతో వకనూతన శకం ఆరంభమైందని మనం భావించాలి. సహకారసంఘాలపై, డెమాక్రటిక్ కంట్రోలు అండ్ మేనేజ్‌మెంటు వుండాలి. సహకార సంఘాలు వాటి జనరల్‌బాడీస్‌ద్వారాను, వారి కాన్ఫరెన్సు ద్వారాను వ్యక్తపరచే విధానమే ఆచరించవలసిన విధానమని, ఆ విధంగానే జరగాలని నేను చెబుతూన్నా. ఈ విధమగు పద్ధతినే అనుసరించాలని, ఆ విధంగానే సహకార వుద్యమ నిర్వాహణ జరగాలని, గతించిన రామదాసుగారు, డాక్టరు గురుమూర్తిగారలు నిరంతరం నొక్కి చెప్పారు. ఆ విధానమే, యిక ముందు ఆచరించాలి. సహకార వుద్యమం, ఆంధ్రదేశంలో జాతీయోద్యమంయొక్క అంగభాగమని శ్రీ ప్రకాశంగారికి కూడా తెలుసు. వారితో నాన్-కో-ఆపరేషన్ వుద్యమంలో పనిచేసిన, డాక్టరు గురుమూర్తి, నరసింహదేవర సత్యనారాయణ మొదలగు జాతీయవాదులందరు సహకారోద్యమంలోనికి వచ్చి సహకారోద్యమం ప్రజావుద్యమంగా చేయడానికి కృషిచేశారు. అట్టి వుద్యమాన్ని, ప్రభుత్వ నియంతృత్వం క్రిందవుండే కీలుబొమ్మగా చేయడానికే రామదాసు పంతులుగారిని, సహకారోద్యమం నుండి తొలగించారు. ఆ తర్వాతనే రామదాసు పంతులుగారు చనిపోయారు.

రామదాసుపంతులు, డాక్టరు గురుమూర్తి చెప్పి బలపర్చిన విధానాలు, తిరిగి సహకార సంఘాలలోను, సహకారవుద్యమంలోను ఆచరణలో

[Sri K. Krishna Rao] [1st December 1953

పెట్టేందుకు తగు విధమగు మార్పులు రావాలని నే నాశిస్తున్నాను. అందుకు కొత్త సహకారసంఘాల చట్టంగూడా, తీసుకురావాలని నేను కోరుతున్నాను.

తర్వాత యీ బిల్లులో కేవలం, స్టేట్ కో-ఆపరేటివ్ బ్యాంకుగూర్చి, స్టేట్ లేన్డ్ మార్ట్‌గేజి బ్యాంకు, స్టేట్ హేండులూమ్ వీవర్సు కో-ఆపరేటివ్ సొసైటీ గూర్చి మాత్రమే చెప్పారు. ఇంతేకాదు. స్టేట్ కో-ఆపరేటివ్ యూనియన్ ఒకటి, స్టేట్ మార్కెటింగ్ సొసైటీ ఒకటి మద్రాసు స్టేట్‌లో వుండేవి. వాటిని కూడా, బైఫర్‌కేట్ చెయ్యాలి. ఇంతే కాకుండా, కర్నూలు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ బ్యాంకు గురించి, అనంతపూరు డిస్ట్రిక్టు కో-ఆపరేటివ్ బ్యాంకు గురించి తగు శ్రద్ధతీసుకొని వారి నెదుర్కొన్న ప్రత్యేక సమస్యలు పరిష్కరించడానికి ప్రభుత్వం కృషి చెయ్యాలని నేను కోరుతున్నాను.

12-00 noon Sri PRAGADA KOTAIAH:—అధ్యక్షా, ఈ మూడురాష్ట్ర సహకారసంఘాలకు సంబంధించిన ఆస్తి అప్పుల విభజన సంపూర్తిగా రిజిష్ట్రారుగారు మాత్రమే చూచినారు అనేది సరియైనటువంటి అభిప్రాయం కాదు. ఈ మూడు సంఘాలుకూడ, వారితాలూకు సర్వసభ్యసమావేశాలలో విభజన సంఘాలు ఏర్పడడం, ఆ విభజన సంఘాలు అంగీకరించిన సూత్రాల ననుసరించి, proposals ordinance కు లోబడి రిజిష్ట్రారు సర్వసభ్య సమావేశము ముందుపెట్టడం జరిగింది. అయితే నేను ఇంతకుముందు చెప్పినట్లుగా ఈ మూడు సంఘాలకు సంబంధించిన ఆస్తి అప్పులగురించి సభవారికి ఎరుక పరచడం ప్రభుత్వముయొక్క ధర్మము. కాని, అవి మాకు సంబంధము లేదని ప్రభుత్వం అంటున్నది. ఈ శాసనము చేయుటకు సభ ముందుకు వచ్చేటప్పుడు, ముఖ్యంగా ఈ మూడు సంఘాల ఆస్తి అప్పుల విభజన, సరిగా, న్యాయంగా జరిగిందని, House కు చెప్పడం అవసరము. అయితే ఆ విభజన చాలా న్యాయంగా జరిగిందని నేను చెప్పడానికి సందేహంలేదు. ఎందుకంటే, సహకారసంఘమునకు సంబంధించినంతవరకు, 50, 50 basis మీాదను, చేనేత సహకార సంఘమునకు 55, 45 basis మీాదను, Central Land Mortgage Bank కు 55, 45 basis మీాదను, విభజన జరిగింది. ఆ విధంగా, సహకార ఉద్యమంలో ఆంధ్రులకు న్యాయమైన భాగమే రాబట్టుటకు ప్రయత్నం జరిగింది. కాని ఈ సంఘాల వారి

స్థితి ఎలా ఉన్నది? వీటిని ముందుకు నడిపించడానికిని, సహకార ఉద్యమాన్ని వ్యాపింపచేయడానికి ప్రభుత్వం ఏమి చేస్తున్నది? ఏదో సంఘాలను నిర్మాణం చేశాము, దీనికి సంబంధించిన శాసనాన్ని అంగీకరించండి అని చెప్పేముందు, ఈ సంఘాలద్వారా ప్రజలకు ఏ ప్రయోజనాలు కలుగుచున్నాయి? వీటిని సాధించడానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నదా? మొదలగు విషయాలగురించి, మంత్రిగారు చెప్పలేదు. అందువల్ల నేను కోరేది ప్రధానముగా ఆ స్తి అప్పుల విభజన యావత్తు సభ్యులకు ఈ రోజు కాకపోయినా తరువాత అయినా, ఆ వివరాలను అందజేయవలసిందని, ఆసంఘములు వాటివిధులను నిర్వహించడానికి ప్రభుత్వము ఏ చర్యతీసు కొంటున్నదనే విషయాలు గురించి తెలియజేయవలసిందని కోరుచున్నాను.

* The Hon. Sri D. SANJIVAYYA:—అధ్యక్షా, ఈ సహకారోద్యమం ఏ విధంగా పనిచేస్తున్నదనే సంగతి, అందులో ఏలోటుపాట్లు ఉన్నాయనేసంగతి నేనుకొంతవరకు, గత $1\frac{1}{2}$ సంవత్సరములుగా గుర్తించాను. మద్రాసురాష్ట్రంలో ఉండినప్పుడు ఈ సహకారోద్యమమునకు సంబంధించినటువంటి సవరణబిల్లును తీసుకొనివచ్చి, ఈలోటుపాట్లను సరిచేయవలెననే ఉద్దేశ్యముతో ఉంటిమిగాని, అవకాశము చిక్కకుండిన కారణము చేత అట్లే ఉండిపోయినది. ఇప్పుడైనా ఈ సహకారసంఘ చట్టాన్ని తప్పకుండా సవరించాలని అంటున్నవారిలో నేను ఒకడను. అందువల్ల త్వరగా అటువంటి సవరణ తీసుకొని రాగలమని హామీ ఇస్తున్నాను. రెండవది, ఇప్పుడు ఆంధ్రకు ప్రత్యేకంగా ఈ సంస్థలు ఏర్పడినాయి వీటి యొక్క ఆ స్తి అప్పుల విభజన ఏ విధంగా ఉన్నప్పటికీ, ప్రగడకోటయ్య గారు ఈ విషయములో న్యాయము జరిగిందనే అంటున్నారు. కాని, ప్రభుత్వము ఈ సంస్థలను ఏవిధంగా నడిపిస్తున్నది? అవి, వాటి విధులను ఏ విధంగా నిర్వహిస్తున్నాయి, వాటియొక్క ఆర్థికస్తోమత ఏ విధంగా ఉన్నది? అవి ప్రజలకు సరిగా ఉపయోగపడుతున్నవా? అనేసంగతి గురించి చెప్పవలసిందని ప్రగడకోటయ్యగారు అడిగారు. దానికి నా సమాధానము చెప్పుచున్నాను. ఇప్పుడిప్పుడే ఈ సంస్థలు ఏర్పడినాయి, ఈ సంస్థలలో ఏయే చిక్కులున్నవో తెలుసుకోవలసి యున్నది. వీటన్నిటినీ సమగ్రంగా పరిశీలించి, ఏమి చేయవలసి యున్నదో, ఎంతవరకు చేయడానికి సాధ్యమౌతుందో అది చేయడానికి ప్రభుత్వము వెనుకంజ వేయదు అని హామీ

ఇస్తున్నాను. కనుక సభ్యులందరు దీనిని అంగీకరించ వలసిందని కోరుచున్నాను.

Mr. SPEAKER :—The question is:

"That the Andhra State Co-operative (Reconstitution and Formation) Bill, 1953, be passed into law."

The motion was carried and the Bill was passed into law.

Mr. SPEAKER :—We will now take up the next item on the agenda.

### (2) THE ANDHRA PAYMENT OF SALARIES AND REMOVAL OF DISQUALIFICATIONS BILL, 1953

The Hon. Sri N. SANJEEVA REDDI:—Sir, I introduce the Andhra Payment of Salaries and Removal of Disqualifications Bill, 1953, and move that the Bill be taken into consideration at once. అధ్యక్షా, కో-ఆపరేటివ్ బిల్లు మాదిరిగానే దీనినిగూడ ఒక routine type of Bill గా తీసుకోవాలని మనవి చేస్తున్నాను. మద్రాసు ప్రభుత్వములో ఉన్న చట్టాలు ఆంధ్ర ప్రభుత్వానికి వర్తిస్తాయి, కాని ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకమైన శాసనసభ ప్రభుత్వము అప్పటికి లేకపోవడంవల్ల ఈ ప్రభుత్వానికి, శాసనసభ్యులకు, తమకు, డిప్యూటీ స్పీకరు మొదలైన వారందరికి జీతము, బత్తాలు ఇవ్వడానికి ఒక బిల్లు ప్రత్యేకంగా చేయవలసి వచ్చింది. ఇది క్రొత్తరకమైన బిల్లుకాదు. కరువు వేతనాలు మొదలైనవి ఇందులోలేవు, ఉన్నవాటినే చట్టసమ్మతంగా చేయడానికి ఈ బిల్లు ప్రతిపాదించవలసి యున్నది. అప్పుడు అసెంబ్లీ లేకపోవడంవల్ల గవర్నరుగారిచే ఒక ordinance చేయింపబడి, ఇప్పుడు శాసనబద్ధంగా చేయబడుచున్నది. దీనికి ఎక్కువ తర్జనభర్జనలు అవసరము లేదనుకొంటాను.

మంత్రుల జీతభత్యాలే కాకుండా, స్పీకరు, డిప్యూటీ స్పీకరు విషయమే కాకుండా, శాసనసభ్యులు ఇందులో భాగస్వాములుగా ఉంటారు. ఇందులో ఎక్కువగా చర్చించవలసిన క్రొత్త విషయాలు ఏమీ లేవు. కనుక దీనిని త్వరితగతిని, ఒకటిగంట కాలమును పూర్తి చేసుకోవచ్చును అని [illegible] శాసనసభ్యులు సహకరించ వలెనని కోరుచున్నాను.

1st December 1953]

Mr. SPEAKER :—The motion before the House is: "That the Andhra Payment of Salaries and Removal of Disqualifications Bill, 1953, be taken into consideration at once."

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Sir, I move: "That the Bill be referred to a Select Committee." అధ్యక్షా, ఈ బిల్లు మంత్రులకు, శాసనసభ్యులకు, మన అందరి జీత భత్యాలు ఇచ్చేందుకు తీసుకొని రాబడినది గనుక, ఎక్కువ చర్చించ నవసరంలేదు, ఎంత త్వరగా దీన్ని pass చేస్తే అంత మంచిది అని. ఉప ముఖ్యమంత్రిగారు చెప్పారు. దీన్నిబట్టిచూస్తే మనకు సంబంధించిన విషయాలు మాత్రం త్వరగా పరిష్కరించుకొనేదానికి ఆత్రపడుతున్నామేగాని ఇతరులకు ఇబ్బందులు వచ్చినప్పుడు, ఇంతటి ఆదుర్దా వుండదని తెలుస్తున్నది. ఇదే మాదిరిగా ఇతరుల కష్టసుఖాలను గూడ consider చేస్తే ఎంతో బాగుంటుంది. రెండవది, ఈ విషయములో ఒక ordinance ను ఎందుకు తీసుకొనివచ్చారో బోధపడడంలేదు. ఏవో కారణాలున్నాయని అన్నారు. నేను మద్రాసులో తీసుకొని వచ్చినబిల్లు చదివాను. ఒక డిప్యూటి ముఖ్యమంత్రి అనే ఒక కొత్తపదము తప్పితే, దానిలో కొత్తదేమిలేదు. ఇతర కారణాలేవి ఉన్నాయో తెలియదు. Adaptation Act అని ఒకటి ఉన్నది. దానిక్రింద అన్ని శాసనాలు adopt చేసియుండవచ్చు. తరువాత వేరుగా బిల్లుతీసుకొని రానవసరం ఏమి? కనుక ఇందుకుOrdinance తీసుకొని రావలసిన అవసరమేమో బోధపడలేదు. దానిక్రింద రూల్సుతయారు చేస్తున్నారు అని వుంది. ఆ రూల్సు రాలేదు. Ordinance అమలు జరుగుచున్నది. రూల్సు లేకుండానే అమలు జరుగుచున్నది. లేకపోతే అంతకు ముందువున్నరూల్సు యిక్కడగూడా అమలు జరగటానికి హక్కువున్నదా? అలాగే Adaptation Act ననుసరించి పాతరూల్సు అమలు జరుగుతాయి అంటే, ఆ రూల్సు ఉన్నప్పుడు, శాసనంమాత్రం ఎందుకు అమలు జరుగదు? మనకవసరమైనదేదో ముందు చేతిలోనికి తీసుకోటానికి నిర్ణయించుకున్నాము అన్నమాట. ఎవరైతే ఖర్చునిర్ణయం చేయాలని అనుకుంటున్నారో వారు శాసనసభ్యులవుతున్నారు. అందుకవసరంగా Ordinance అమలు జరిపారు. అయితే, ఎంతడబ్బు యివ్వాలనేది నా ప్రశ్నవున్నది. ఈ ప్రశ్నను తృప్తి పరచుకోటానికి సమాధానం రావలసియున్నది. కరాచీ కాంగ్రెసులో తీర్మానించిన ప్రకారం కాంగ్రెసు మంత్రుల జీతాలు అయిదు

[Sri Vavilala Gopalakrishnaiah] [1st December 1953

వందల రూపాయలకుమించి వుండకూడదని ఆదేశించబడింది. అందువల్ల యీ ప్రభుత్వ మంత్రులు కాంగ్రెసు మంత్రివర్గము అని అంటున్నారు. కాబట్టి మీరు యిప్పుడు అయిదువందల రూపాయలకు మించి తీసుకోకూడదని అంటున్నాను. 1937 వ సంవత్సరములో కాంగ్రెసు మంత్రివర్గములో ప్రతిమంత్రికి 500 రూపాయలు జీతం, దీనికితోడు అలవెన్సు 150 రూపాయలు, ఖర్చులు 150 రూపాయలు యిచ్చారు. సభ్యులకు నెలకు 75 రూపాయలు యిచ్చారు. 1946 లో వచ్చిన మంత్రివర్గం, ధరలు పెరిగినవి గనుక నెలకు 1000 రూపాయలు జీతము, House rent allowance 250 రూపాయలు, కారు ఎలవెన్సు 250 రూపాయలు ఖర్చుకు యిచ్చారు. తర్వాత మంత్రివర్గముకూడా అదే continue చేసింది. ఆ తరువాత కూడా అది continue కావాలని అన్నారు. ఏ మంత్రి అయినా అధికారములో వున్నంతవరకు ఈ జీతము మార్చుకోకూడదని అభ్యంతరము చెప్పాను. ఆయన మార్చుకుంటే మార్చుకోవచ్చు. కరాచి తీర్మానము ప్రకారము వుండవలసిన జీతము ఎందుకు ఎక్కువ చేశారంటే దేశములో ధరలు పెరుగుతూ వున్నవి, అందువల్ల ఎక్కువచేశాము అన్నారు. అందులో ఈ జీతముపైగా ప్రభుత్వ సెక్రటరీలకు, I. C. S. ఆఫీసర్లకు జీతములో ఒక రూపాయికూడా హెచ్చు చేయడానికి ఎవరూ అంగీకరించరు. నేను అంగీకరించను. ఖర్చు ఎక్కువైనవని హెచ్చిస్తారా? ఎందుకు హెచ్చుజీతాలు యివ్వాలి? జీతాలు హెచ్చించవలసిన పని లేదు కొంతలో సామాన్య వుద్యోగస్థులు, upper division and lower division గుమాస్తాలకు ధరలు ఎక్కువగా పెరిగినందువల్ల, వారు ఒకవూరునుంచి మరొకవూరుకు పోవలసివచ్చినప్పుడు travelling expenses క్రింద సరిపోవు ఖర్చులు యివ్వడములేదు. పోయినవారికి దినమునకు భత్యావు ఖర్చులకుగాను 12 అణాలు యిస్తున్నారు. మనకు, వారికి వున్న కష్టాలు ఆలోచించి, మీరు దయచేసి యీ ధరలు పెరిగిపోతున్నవి కాబట్టి జీతాలు పెంచండి అని అడిగితే, వీలు లేదని అంటున్నారు.

ఒక కంపెనీలోని manager కు నెల 1కి 500 రూపాయలనుంచి 1000 రూపాయలకు జీతము పెంచారు. కాని దేశములో వున్న కార్మికుల జీవిత పరిమాణము ఎక్కువ అయినందువల్ల, ఒక్కొక్కరికి దినమునకు ఇచ్చే వేతనము రు 0-4-0 అయినప్పుడు, వారు ఒక అణా ఎక్కువ చేయమని [illegible] చెప్పదివమా [illegible] ఆ manager [illegible]

1st December 1953] [Sri Vavilala Gopalakrishnaiah]

ఏమిటంటే, 1600 మంది workers వున్నారు. వారికి తలకు ఒక అణా చొప్పున దినమునకు ఇస్తే మొత్తంమీద దినమునకు నూరురూపాయలు అవుతుంది. నెలకు 3,000 రూపాయలు అయితే, సంవత్సరానికి 36,000 అవుతుంది. అదే మేనేజరుకు యిస్తే, సంవత్సరానికి 12,000 లే కదా, అంటాడు. అయితే కార్మికుల దృక్పథముతో ఆలోచిస్తే, కోరింది ఒక్క అణా మాత్రమేగాని, ఆ కార్మికులకు నెలకు మొత్తముమీద మూడువేల రూపాయలు యివ్వవలసియుంది. ఇవ్వబోయేటప్పుడు యింత పెద్ద మొత్తము ఎట్లా యిస్తాం అని అంటే ప్రయోజనం? అధిక సంఖ్యాక కూలీలకు కనీస సౌకర్యం యివ్వటానికి తిరస్కరించి ఒక్కనికి ఎక్కువజీతం యివ్వడం ఎంత అన్యాయంగా వుందో, వందలువేలుగా వున్న చిన్న జీతగాండ్రకు ఒక రూపాయ కూడా అదనంగా యివ్వడానికి అంగీకరించక తిరస్కరిస్తూ, 8 మంది మంత్రులకు ధరలెక్కువగా వున్నవని జీతాలు ఎక్కించుకోవడం న్యాయంకాదు. తరువాత యీనాడు మనమంత్రివర్గము తీసుకునే జీతముచూస్తే కరాచీ కాంగ్రెసు తీర్మానానికి విరుద్ధముగా తీసుకుంటున్నారు. నాన్ గెజెటెడ్ వుద్యోగస్థులకు యీ రోజులలోవున్న ధరలనుబట్టి జీతాలు పెంచవలసిన అవసరము వున్నది. ఆ ప్రాతిపదికమీద అందరికీ జీతాలు పెంచి మీరుకూడా ఆ విధంగా తీసుకుంటే నాకు అభ్యంతరములేదు. మంత్రులను, జీతాలను తగ్గించుకోమంటే, వారికి ఆ యిబ్బందులు వున్నవి, యీ యిబ్బందులు వున్నవి, యింకను స్నేహితులు, బంధువులు వస్తూవుంటారు, వారికి కావలసిన మర్యాదలు చేయవలసి యుంటుంది. అందువల్ల, ఖర్చులు ఎదుర్కోవలసినందున, జీతాల తగ్గింపుకు వొప్పుకోమంటారు. అట్లు ఒప్పుకోకుండా, మేము అధికార వర్గములో వున్నందువల్ల మేము మర్యాదలు జరుపుకోవలసి వస్తుంది. ఖర్చులు అవసరము ఉంటూఉంటవి. మా జీవనవ్యయానికి తగినట్లు లోపము లేకుండా మాకు వున్నయిబ్బందులు చూడవలెనని అంటారా? ఆ విధంగాచూస్తే యీ మంత్రివర్గములోని వారు Non-Gazetted Officers యొక్క పరిస్థితులు చూడవలసి యుంటుందని కూడా నా సలహా యివ్వదలచాను. Non-Gazetted Officers కు వున్న యిబ్బందుల నివారణకు గాను ప్రాతిపదికలు అమలు జరుపుండి. వారి కిచ్చి మీరు తీసుకోండి. అప్పుడు అభ్యంతరం ఉండజాలదు. అంతేకాకుండా మంత్రులు యీ రోజులలో ఘనస్వాగతములో ప్రయాణాలు చేస్తూ

[Sri Vavilala Gopalakrishnaiah] [1st December 1953

వున్నారు. దీనికిగాను travelling allowance క్రింద ఎంతడబ్బు ఖర్చు అవుతుందో గ్రహించాలి. ప్రజల జీవన ప్రమాణము III class కన్న పెరగలేదు. అందుకని అందరు III class లోనే ప్రయాణం చేయాలంటాను. రైళ్లలో ప్రయాణము చేస్తున్నప్పుడు సామాన్య జనముకూడా ఎక్కేటప్పుడు అందరు III class లో క్రిక్కిరిసి వుంటారు. మనము I class, II class లలో ప్రయాణము చేస్తూవుంటే ఆ జనానికి యిబ్బందులు ఏ విధంగా కలుగుతున్నవో గ్రహించలేక పోతాము. మనము ప్రజా ప్రతినిధులము అనిపించుకున్నప్పుడు ప్రజలకు సేవచేయడమే మన ముఖ్య కర్తవ్యము. ఆ పైమములో మనము వాళ్ల యిబ్బందులు గూడ గ్రహించాలి. ఇటువంటి విషయాలు అనేకము లున్నవి. అందువల్ల మనము అందరము ఒకటే స్థాయిలో నడవడము అనే దృక్పథము అవలంబించాల్సి వున్నది.

ఇప్పటి ప్రభుత్వములో మంత్రులు నెలకు 1,000 రూపాయలు జీతములు పుచ్చుకుంటున్నారు. ఇదికాక కారు అలవెన్సు క్రింద 250/- రూపాయలు, ఇంటి అద్దెక్రింద 250/-రూపాయలు పుచ్చుకుంటున్నారు. ఈ జీతము కాంగ్రెసు mandate కు వ్యతిరిక్తము కాబట్టి, వీరికి జీతములు తగ్గవలసి యున్నది. ఇదియునుగాక శాసనసభ్యులమైన మేమందరము యీనాడు తీసుకొనేటటువంటి జీతముకూడా తగ్గించవలసి యున్నది. ఈ వేతనాల తగ్గింపుకు నేను amendment ను తెచ్చాను. నేను యీ మాట చెబితే వారికి కష్టముగా వుండవచ్చు. కాబట్టి మంత్రులకు, సభ్యులకు జీతాలు తగ్గించవలసి యున్నది. మన హయాములో మనము జీతము తగ్గింపుకు తయారై లోయర్ standards లో వున్నవారి జీతములు higher standard లోకి తేవాలి. ఈ విధమైన దృక్పథము ప్రభుత్వము అవలంబిస్తే ప్రజాక్షేమము కోరినవారమగుదుము. కాబట్టి higher standard లోని వారు జీవన వ్యయ ప్రమాణము తగ్గించుకోటానికి సంసిద్ధులు కావలసి వున్నది కాబట్టి నేను యిప్పుడు ప్రభుత్వము తెచ్చిన వేతనాల బిల్లుకు నా అభ్యంతరము చెబుతూ, నా జీతాన్ని తగ్గించుటకు అభ్యంతరము లేదని అంటున్నాను. ఈ మొత్తంగా ఉన్నవాటిలో, నేను పెట్టిన amendment లు చాలా వున్నాయి. వాటిలో కొన్నిటిని అంగీకరించవచ్చును, అంగీకరించక పోవచ్చును. ఈ విషయంలో మనం కూర్చుని ఒక understanding కు వస్తే బాగుంటుంది. అనేక మందికి అనేక భావాలున్నాయి. అవి చర్చించుకుందాం. Select Committee commence అయ్యేటప్పటికి ఇంకో

1st December 1953] [Sri Vavilala Gopalakrishnaiah]

సమస్య వస్తోంది. Ordinance రేపు ప్రొద్దుట ఐపోతుంది. ఆర్డినెన్సు ఆరువారాలకన్న బ్రతికియుండదుకాబట్టి ఈ లోపుగా ఏమిచేస్తారనవచ్చు? అవునా? లెక్క వెయ్యండి. జనవరి 3 వ తారీఖున సమావేశం కాబోతూ ఉన్నామంటున్నారు. ఈ సమావేశం 23 వ తారీఖున ప్రారంభం లెఖ్ఖ వేస్తే 5 లేక 6 వ తారీఖువఱకూ అవుతుంది. ఆ లోగా బిల్లు తయారు చేయవచ్చునుగదా! సమయం చాలదంటారా? మొట్టమొదటి ప్రయారిటీ దీనికి ఇవ్వండి. ఒక agreement కు మనం వస్తే బిల్లు pass చేయించడంలో time పట్టదు. అభిప్రాయం క్రోడీకరణ జరిగినప్పుడు బిల్లు అలస్యంకాదు. మనం ఈ బిల్లు సెలక్టు కమిటీకి పంపి అవతలనుంచి ఇవతలవఱకూ ఆలోచించుకోని కారణంచే ఇన్ని ఇబ్బందులు వస్తున్నాయి. మంత్రుల బిల్డింగ్సుకు ఎంత ఇస్తున్నారో తెలియదు. మంత్రులు ఏమి చెబుతారో తెలియదు. Standards అన్నీ సరీగ్గా ఉన్నాయా? హైదరాబాదు శాసన సభ్యుడికి 250 రూపాయిలు జీతం. 150 రూపాయిలుంటే అది కాదని ప్రతిపక్షం 200 పెట్టమంటే, అదీకాదని 250 రూపాయలన్నారు. ఇండియన్ coin లోనో, హైదరాబాదు coin లోనో! ఇతర రాష్ట్రాలలో ఇతర విధాలుగా ఉన్నాయి. అన్నీ ఒక విధంగా ఉండవు. మన character వేరు. వారి character వేరు. మదరాసులో ఐనఖర్చు కర్నూలులోఉంటుందా అంటే మనం ఆ విషయం ఆలోచించుకొన వలసియుంటుంది. హైదరాబాదు గవర్నమెంటులో మంత్రుల విషయంచూస్తే ఆశ్చర్యం వేస్తుంది. నవాబు తర్వాత మళ్ళీ నవాబులుగా తయారైనారు. మంత్రుల ఇండ్లకు వసతి కల్పించడానికి ఒక్కొక్క ఇంటికి రు. 10 వేలు మొదలు రు. 20 వేలు వఱకూ equipment అదీ ఖర్చులు. తివాచీ చెడిపోయిందని అది తీసివేసి రు. 250 లు తివాచీ వేస్తారు. పోనీ వారిసంగతి మనకెందుకు. వారికిస్తూయున్న సౌకర్యాలను గురించికాని వారిని ఆక్షేపణచేసే విషయాలు మనకక్కరలేదు. ఆ సౌకర్యాలు ఈవేళ ఆంధ్రప్రభుత్వం ఇవ్వగలిగిన స్థితిలో ఉన్నదా? ఆంధ్రరాష్ట్రం నిర్మాణమైన తర్వాత మంత్రులున్న ఇండ్లు బాగుచేయించారు. తరువాత ఇండ్ల Ordinance తీసుకు వచ్చారు. మళ్లీ Ordinance రద్దుచేశారు. ఏ మంత్రిగారి ఇంటికి ఎంతఖర్చుచేశారో తెలియదు. నిరాడంబరంగా వ్యవహరిస్తూఉన్నామూ అంటే దానికికూడా ఒప్పుకుంటే సరిపోతుంది. అంత ఖర్చుచేయుటకు తాహతు ఉందా అని ప్రభుత్వాన్నే నేను ప్రశ్నించేది? అందరికీ సమాన standard ఏనా అన్నప్పుడు మన ఆదాయాన్నిబట్టి

[Sri Vavilala Gopalakrishnaiah] [1st December 1953

standard maintain చేదాం. బొంబాయిలోనూ, U. P. లోనూ, Calcutta లోనూ, అన్నిటికన్నా గొప్పసంస్థానంగా యున్న హైదరాబాదు పద్ధతి అవలంబించుదామా ? మనకు తగ్గట్టు వ్యవహరించుదాము. ఎవరో అసెంబ్లీ మెంబర్లకు ఇండ్ల సౌకర్యాలో అన్నారు. వారి సౌకర్యాలు చెప్పనక్కరలేదు. మదరాసులో ఉండగా గదికి 3 రూపాయలు వసూలు చేస్తే ఇక్కడ 2 రూపాయిలు గది అద్దె అన్నారు. బాగానేఉంది. ఒక్కొక్కరికీ 2 రూపాయలు అన్నారు. మొత్తం గదికి 4 రూపాయలయింది. ఉన్న సౌకర్యాలు సర్దుకొనుటకు మేము ప్రయత్నం చేస్తున్నాం. లేకపోతే చిక్కులు వస్తాయి. ఎందుకు సర్దుకోవాలంటే ఆంధ్రరాష్ట్రం సాధించిన తరువాత సామాన్యమానవుడికీ సామాన్య ఉద్యోగస్థుడికీ జీవితప్రమాణంలో ఏమాత్రం ఎక్కించగలమనే మన ఆశయాన్ని మన దౌర్భాగ్య స్థితిలో అమలులో పెట్టగలమా అని సందేహంగాఉంది. ఆంధ్రరాష్ట్రం వచ్చిందనే ఉత్సాహం కల్గించలేక బాధపడుతున్నాం. బెజవాడలో గోపరాజు రామచంద్రరావుగారు నిరాడంబరంగా జీవించాలి, ప్రతివ్యక్తికీ అవసరానికి మించిన రాబడి ఉండకూడదని ప్రచారం చేసుకుంటూ ఉంటే అక్కడకు గవర్నరు వచ్చినప్పుడు ఆయనను అరెస్టుచేసి జైలులోపెట్టారు. ఈ సంగతి విశాలాంధ్ర పత్రిక తప్ప ఇతరపత్రికలు వేయలేదు. 'ఆర్థిక సమత' మాత్రము నడుస్తున్నది. మనం మొట్టమొదట ఏ వుద్యమం ప్రారంభించినా మన వెనక ఎవరూ రారు. మనల్ని పిచ్చివాళ్ళక్రింద కడతారు. కట్టారు. అరెస్టుచేసి తీసుకుపోతారు. ఇదివరలో ఆ arrest ఐన మనుష్యులే ఇప్పుడు అధికారంలో ఉండడం జరిగింది. ఆ రోజులలో పద్ధతి అది. అది ఒక ఉద్యమం. అది symbolic movement ఒక issue కోసం ఉద్దేశించినది. ఈ బిల్లు Select Committee కి పంపితే అందులో మనం తీవ్రంగా చర్చచేయవచ్చుని అవసరమైన మార్పులు చేయవచ్చునని మనవి చేస్తున్నాను.

* Sri PILLALAMARRI VENKATESWARLU:— అధ్యక్షా! మన గవర్నమెంటు మదరాసు State లో ఉన్న చట్టాన్ని copy కొట్టి తీసుకువచ్చి మనముందు పెట్టింది. ఆ చట్టాన్ని ఆమోదించ వలసి కోరుతోంది. ఈచట్టం ఎక్కువ complicated గా కాని, అందులో legal points గా కాని, ఎక్కువలేవు. [illegible] simple గా

ఉన్నాయి. దానిలో అనవసరమైన సంగతులుంటే మార్చుటకు అవకాశాలున్నాయి. మార్చుటకు వీలుంది. అందువల్ల మనమంతా దానిలోఉన్న అంశాలు జాగ్రతగా ఆలోచించి అనవసరంగా ఉన్న విషయాలుతీసి వేయుటకు ఆలోచించాలని నా మనవి. దానిలో ప్రధానంగా ఈ బిల్లు చదివినప్పుడు అనవసరం అని అగపడేది పార్లమెంటరీ సెక్రటరీలు, వారికి సంబంధించిన విషయాలు. ఈ బిల్లులో Parliamentary Secretary, Chief Parliamentary Secretary ల పేర్లు వచ్చినాయి. వెంటనే ఇటువంటి వారు నియమింప బడుతున్నారా అని నా ప్రశ్న. మాకు సంబంధించినంత వరకు ఈ Parliamentary Secretary లు, Chief Parliamentary Secretary లు చాలా అనవసరం. వారిని నియమించడంవల్ల లాభంకన్న నష్టమే ఎక్కువని సంజీవరెడ్డిగారికి చెప్పబోతున్నాను. ఈ విషయాన్ని వారు కూడా అంగీకరిస్తే వెంటనే clause 5 తొలగిస్తే సరిపోతుంది. మున్ముందు తీసుకోవలసిన అవసరం వున్నదో లేదోకూడా చర్చించవచ్చును. ఇపుడు మనకు ఎనిమిదిమంది మంత్రులు వున్నారు. ఇంకా ఎంతమందిని తీసుకుంటారో తెలియదు. ప్రారంభం 5 గురితో, తరువాత తరువాత ఎనిమిది మందివరకు పెరిగారు. త్వరలో నవగ్రహాలుగా అవుతారేమో తెలియదు. వీటికితోడు పార్లమెంటరీ సెక్రటరీలను నియమించడానికి అవకాశం కల్పించడం అనవసరమని అనుకుంటున్నాను. 140 మంది సభ్యులు అయినప్పుడు 9 మంది వరకు మంత్రులుగా వుండునపుడు, మంత్రులకు సహాయం చేయుడానికి సెక్రటరీలు, డిప్యూటీ సెక్రటరీలు అనేకమంది ఆఫీసర్లు వున్నపుడు, ఇంకా పార్లమెంటరీ సెక్రటరీల ప్రస్తావన ఎందుకు రావాలని మా ప్రశ్న. బహుశా పార్లమెంటరీ సెక్రటరీలను కూడా వేస్తేనే గాని stable government ఏర్పడదేమో. ఇటువంటి ఏర్పాటు పూర్తిగా అనవసరమని మా అభిప్రాయం. ఇప్పట్లో వేసే ఉద్దేశం లేకపోతే Act నుంచి ఆ విషయాన్ని తొలగించవచ్చును. ఈ విషయం ప్రభుత్వం ఆలోచించాలి అని కోరుతున్నాను. పార్లమెంటరీ సెక్రటరీలనుకూడా వేసుకుంటే మనకువచ్చే ఆదాయం అంతా మంత్రులు, సభ్యులు, సెక్రటరీల జీతాలకే సరిపోతుంది. జీతాల కోసమే కేంద్రప్రభుత్వం దగ్గర అప్పుచేయవలసి వస్తుంది. ఆ దుస్థితి కలుగ చేయవద్దని, ఇటువంటి అవకాశం బిల్లులో కల్పించవద్దని కోరుతున్నాను. బిల్లులోవున్నప్పటికి మేము నియమించబోవటం లేదని మంత్రిగారు చెప్పవచ్చును. చేయకుండా వుంటారనే హామీ ఏమిటి? ఒకవేళ చేస్తే, అప్పుడు

[Sri Pillalamarri Venkateswarlu] [1st December 1953

విశ్వాసరాహిత్య తీర్మానం తీసుకురావచ్చునంటారు. అటువంటి temptation రాకుండా వుండడానికి ఆ clause ను తీసివేయాలి అని కోరుతున్నాను. విశ్వనాథంగారికి పార్లమెంటరీ సెక్రటరీలంటే అభిమానం వుండేమో అనిపిస్తుంది. వీరు వెనుక Chief Parliamentary Secretary చేశారు. ParlimentarySecretary కూడా చేశారు. వీరికి పార్లమెంటరీ సెక్రటరీలను నియమించడంలో వుండే ఇబ్బందులు, చిక్కులు బాగా తెలుసుననుకుంటాను. ఎంతమందికి ఉద్యోగాలు ఇచ్చి stable government స్థాపించుకుంటారు? మీకు చేసే విజ్ఞప్తి ఏమిటంటే, clause 5 తొలగించండి అని. రెండవ విషయం గోపాల కృష్ణయ్యగారు చెప్పివున్నారు. వెయ్యిరూపాయలు ఎక్కువజీతమా, తక్కువా అనేదికాదు విషయం. దానివల్ల ఎంత ఆదాయం మిగల్చ గలుగుతారు అనేది కూడా కాదు ప్రశ్న. మా విమర్శ ఏమిటంటే ఆంధ్ర బడ్జెటు మంత్రి ఒక్కంటికి వెయ్యిరూపాయల జీతాన్ని భరించగలదా అన్నదేవిషయం. మొన్న ప్రకాశంపంతులుగారు గవర్నరుగారు తమ జీతాన్ని నెలకు రు 1250 లు వంతున తగ్గించుకొన్నారని చెప్పారు. 20% తగ్గించుకొన్నారు. ఆ విధంగా గవర్నరుగారు మంత్రులకు మార్గదర్శకంగా వున్నారని అనుకోవచ్చును. మీరుకూడా ఏమైనా తగ్గించుకునేందుకు ఆలోచిస్తున్నారా అని అడుగుతున్నాను. విశ్వనాథంగారు Bachelor. ఖర్చు ఎక్కువలేదు. వారు తమ జీతంలో తగ్గించుకోగలరనుకుంటాను. సంజీవరెడ్డిగారు జీతంలేకుండా పని చేయగలరు. ఈ వెయ్యిరూపాయిలు లేకపోయినా వారి బాధ్యతలు నిర్వర్తించడానికి వీలు వుంటుంది అని అంటాను. మన ఆంధ్ర ప్రభుత్వం ఉద్యోగస్థులకు ఎంత జీతాలు ఇవ్వగలదో ఆలోచించాలి. ఆంధ్రరాష్ట్రం వచ్చే సందర్భంలో ఉద్యోగస్థులు ఎక్కువ జీతాలు వస్తాయి అనుకోవచ్చు. మనం ఎంతో జీతాలు ఇచ్చుకోలేము అన్న సంగతి జ్ఞాపకం చేస్తున్నాను. ప్రజాసేవకులు అంటే మంత్రిపదవులను స్వీకరించిన నాయకులు తమ జీతాలు తగ్గించుకుంటే, తప్పకుండా ఇతర పెద్ద ఉద్యోగస్థులుకూడా తమ జీతాలు తగ్గించుకునేందుకు moral binding వుంటుంది. I. A. S., I. C. S. వుద్యోగస్థుల జీతాలను order ల మూలంగా తగ్గించడానికి కేంద్ర ప్రభుత్వం అభ్యంతరం పెడుతుందని నాకు తెలుసును. మన గవర్నరు, మంత్రులు జీతాలు తగ్గించుకున్ననాడు ఉద్యోగస్థులుకూడా జీతాలు తగ్గించుకోడానికి సుముఖంగా వుంటారని నమ్ముతున్నాను. ఒకవిషయం ఆర్థికశాఖామంత్రి

1st December 1953] [Sri Pillalamarri Venkateswarlu]

గారికి జ్ఞాపకం చేస్తున్నాను. వివిధ ఉద్యోగస్థుల జీతాలు తగ్గించుకోక పోతే మన బడ్జెటును adjust చేయలేము. మీరు అనుసరించ తగిన పద్ధతులు కూడా ఏమీ ఉండవని మనవి చేస్తున్నాను. ఇట్టి పరిస్థితుల్లో మంత్రుల జీతము రు 500 లు వుంటే చాలునని, అట్లా మంత్రులు తమ జీతాలు తగ్గించుకొనినయెడల ఇతర ఉద్యోగస్థుల జీతాలు తగ్గించడానికి moral sanction ఏర్పడుతుందని మా అభిప్రాయము. Chief Parliamentary Secretary కి రు. 600 జీతం, ఏమీ పనివుండదు, వెనుక కూర్చోడంతప్ప. మద్రాసులో ఒక Parliamentary Secretary ని చూశాను. ఒకడే ఒకడు. ఆయనపని మంత్రుల tour programmes sort చేయడం. సభ్యుల జీతాల విషయమై గోపాలకృష్ణయ్యగారు చెప్పినారు. చెప్పిన దాంట్లో సత్యం వుండవచ్చును. సత్యమూర్తిగారు శాసనసభ్యులకు జీతాలు ఇవ్వవలసిన ఆవశ్యకతను maintain చేస్తూ వచ్చారు. ప్రస్తుత పరిస్థితుల్లో బిల్లులో చెప్పబడిన జీతాలు శాసనసభ్యులకు అవసరం అని భావిస్తున్నాం. ప్రజలు ఎన్నుకున్నవారే శాసనసభా వ్యవహారం నడిపించ వలసివుంది కాబట్టి సామాన్య మధ్యతరగతి వారినిగాని, బీదవారిని గాని ప్రజలు ఎన్నుకున్నప్పుడు జీతంలేనియెడల స్వతంత్రంగా సభలో పనిచేయ లేని వాడగును. ధనవంతులే శాసనసభా సభ్యులు కావడమో, ఇతర సభ్యులు ధనవంతుల చేతిలో వుండడమో జరుగుతుంది. ఇపుడు బిల్లులో చెప్పబడినది అధికమని మేము భావించడంలేదు. మామూలు గవర్నమెంటు ఉద్యోగస్థునికి వుండే కనీస జీతమైనా వుండాలని మేము అభిప్రాయపడు తున్నాం. సాధ్యమైనంతవరకు తగ్గించాలి అనేది మా అభిప్రాయం అయి నప్పటికీ ఆచరణ సాధ్యంకాని తగ్గింపులవల్ల ఏదో సాధించామని కాని save చేశామని కాని మేము అనుకోడంలేదు. Clause by clause చర్చ వచ్చినపుడు మిగతా విషయాలు చెప్పకోవచ్చును. నేను చెప్పదలచు కున్నవి రెండే విషయాలు: ఒకటి, పార్లమెంటరీ సెక్రటరీల నియామకానికి సంబంధించిన క్లాజు తీసివేయాలి. రెండు, మంత్రులు తమ జీతాలను రు 500 లకు తగ్గించుకొని ఇతర ఉద్యోగస్థులుకూడా తమ జీతాలు తగ్గించుకోడానికి మార్గదర్శకులు కావాలి. ఈ విషయాలకు సంజీవరెడ్డిగారు అంగీకరిస్తారని, దానికి తగుమైన మార్పులు బిల్లులో చేస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

[1st December 1953

* Sri B. KRISHNAMURTHY RAO:—అధ్యక్షా, ఈ సమస్యపైన 2, 3 ఖచ్చితమైన అభిప్రాయాలను మిత్రులు వెలిబుచ్చారు. గౌరవనీయులైన మిత్రులు గోపాలకృష్ణయ్యగారి వలె ఏకాకిగా వున్నటువంటి సభ్యులు అంగీకరించి నట్లయితే భార్యగాని పిల్లలుగాని లేకుండా ఏకాకిగా వున్నట్లయితే 5 రూపాయలు కాదు, రోజుకు $1\frac{1}{2}$ రూపాయలు యిస్తేచాలు అని మనవిచేస్తున్నాను. III క్లాసు కూడా అక్కరలేదు. IV క్లాసు యిచ్చినా సరిపోతుంది. అయితే అందరము ఆవిధంగా వున్నామా? లేము. వారికి సంసారం వుందో లేదో తెలియదు—కాని అడిగితే చెప్పలేదు. మీా కెందుకులే అన్నారు. అటువంటి వారికి పరవాలేదుగాని మాబోటి పేద వాళ్లకు పెద్ద సంసారం వుంటుంది. రాజకీయాల్లో ప్రవేశించి ప్రజాసేవ చేయడానికి అసెంబ్లీ సభ్యుడుగా అయినవారిలో చాలామందికి వారి జీతం 150 కుటుంబ పోషణకు చాలీ చాలనట్లు సరిపోతుంది. శాసన సభ్యుడు తన నియోజక వర్గంలో తిరిగి ప్రజల కష్ట సుఖాలు తెలుసుకోవడం విధి. శాసనసభ్యులకు, మంత్రులకు జీతం తగ్గించాలని రకరకాలుగా చెబుతూ వచ్చారు. శాసనసభ్యులకు యిచ్చేటటువంటి allowance సరిపోతుందని చెప్పలేము. మన కుటుంబ వ్యవహారం సంసార పక్షంగా వున్నది. మనం కోరేది వున్నతస్థాయికోసంకాదు. ప్రజ లనుకుంటారు కదా, "యీాయన M. L. A. కదా ఆయన కేమయ్యా" అని. కాని M. L. A. కు ఎంత వస్తుందో, కనీసం Incometax విధించడానికైనా తగిన జీతమా అని ఆలోచించరు. ఇది శాసన సభ్యులందరికీ సంబంధించినది కనుక యిటువైపువారు, అటువైపువారు ఏకగ్రీవంగా యీా సవరణకు వ్యతిరేకంగా vote చేయాలని కోరుతున్నాను. తరువాత మంత్రుల జీతాల విషయంలో యింత చర్చ అనవసరం. వారు రాష్ట్రం అంతా తిరగాలి. వారి హోదాకు తగినట్టుగా జీతాలుండకపోతే వారి ధర్మం తృప్తికరంగా నిర్వహించడానికి అవకాశం వుండదు; దీనిమీాద 4 రోజులు చర్చ జరిపి ప్రభుత్వానికి కొన్ని వేల రూపాయలు నష్టం కలిగించే అంత తీవ్రమైన సమస్యకాదిది. ఈ బిల్లును ఆమోదించమని నా విజ్ఞప్తి. శాసన సభ్యులకు 150 చాలదు. ఇంకో వంద యెక్కువ యివ్వాలని నేను కోరుతున్నాను.

* Sri V. SRI KRISHNA:—ఈ జీతాల బిల్లు సందర్భంలో కృష్ణమూర్తిరావుగారు చెప్పినదానితో శాసనసభ్యులకు సంబంధించినంతవరకు

ఏకీభవించవలసి వున్నది. యే ఆధారం లేనటువంటివారు శాసన సభ్యుడుగా ప్రజా ప్రతినిధిగా సేవచేస్తూ తక్కువ జీతంతో కుటుంబ పోషణ చేయడం కష్టము. అయితే మరొక సూచన చేశారు. ప్రతిపక్షంవారు అడ్డు పెట్టకుండా త్వరగా pass చేస్తే ప్రభుత్వానికి డబ్బు మిగుల్తుందని, వృధా చర్చకు ప్రతిపక్షం వారికి తర్జన భర్జనలకు అవసరం లేకుండా ప్రభుత్వం సక్రమమైన నిర్ణయాలు చేస్తే మంచిదని మనవి చేస్తున్నాను. జీతాల విషయం వచ్చినప్పుడు parliamentary కార్యదర్శి అనవసరం అనుకుంటాను. ఎందుచేతనంటే ప్రభుత్వానికి అవసరమైతే ప్రభుత్వ సిబ్బంది వున్నది. Departmental Heads వున్నారు. Staff వున్నది. తరువాత మంత్రులకు ప్రతి విషయంలో departments అన్నీకూడా సహాయపడతాయి. వారికింకా సహాయం కావాలంటే మామూలుగా Parliamentary కార్యదర్శులను శాసనసభ్యులలోనుండి తీసుకోవచ్చు. కాబట్టి ప్రభుత్వ పక్షంలోని శాసనసభ్యులను యిద్దరు ముగ్గురిని తీసుకొని వ్యవహారం నడుపుకోవచ్చు. వేరే జీతాలు అక్కరలేదు. అందువల్ల Parliamentary కార్యదర్శి అనవసరం. తీసివేయడం ఆదర్శ ప్రాయంగా వుంటుంది. ప్రజలు సంతోషిస్తారు. ఇక మంత్రుల జీతాల విషయం. గవర్నరుగారు 5,500 రూపాయల నుండి 1,200 రూపాయలు తగ్గించుకున్నారు. ఇప్పటి ఆర్థిక పరిస్థితులలో ఆదాయ వ్యయ దృష్ట్యా తగ్గించిన జీతాలతో మంత్రులు తమ అవసరాలను సరిపెట్టుకోగలరని విశ్వసిస్తున్నాను. జీతాల విషయంలో ఒక గరిష్ట ప్రమాణం తీసుకు రావాలని మా వుద్దేశం. కారు ఎలవెన్సు యింటి అద్దెలతోసహా మొత్తం 1500 రూపాయలు జీతం అవుతున్నది. 1500 నుండి కుదించిన మొత్తం 1000 లు. మొత్తం ఆంధ్ర దేశంలో ఉన్నటువంటి ప్రభుత్వ వ్యవహార నిర్వహణ అంతాకూడా చిన్న చిన్న ఉద్యోగస్తుల మీద, వాళ్ల జీతాలమీద ఆధారపడివుంది. వారి జీతాలు పెంచవలసి వుంది. కాబట్టి ఈ సవరణలు ప్రతిపాదించారు. మంత్రులుకూడా చాలా ఉదారంగా ముందుకు రావాలని, ప్రకాశంగారు ఇటువంటి మంచి మార్పు చేస్తారని నేను ఆశిస్తున్నాను. దాంతోపాటు శాసనసభ్యులు మంత్రులు పర్యటన సందర్భంలో ప్రభుత్వ ఖర్చుల మీద కొంతమంది తగ్గించుకోడానికి అవకాశం ఉన్నవాళ్లు తగ్గించుకోవచ్చు. ఈ రోజున కొంతమంది కొన్ని సవరణలుకూడా పెట్టారు. ఊరికే పాస్‌లు ఇస్తే తమ నియోజక వర్గంలో తిరగడానికి మాకు జీతాలక్కరలేదని

చెప్పారు. మరొక సవరణ ఏమంటే ముఖ్యంగా ప్రభుత్వంతోను, ప్రభుత్వ శాఖలతోను, తమ తమ నియోజక వర్గాలలోని ప్రభుత్వ ఉద్యోగుల తోను వ్యవహారములు నడుపవలసి వచ్చినప్పుడు అందుకయ్యే పోస్టల్ చార్జెస్ ఇవ్వాలని. ఒక్కొక్క రోజున రెండు, మూడు రూపాయలు ఈ పోస్టేజి క్రింద ఖర్చుపెట్టవలసి వస్తున్నది. అందుచేత ఈ పోస్టల్ వ్యవహారాల్లో సర్వీస్ స్టాంపులు ఇచ్చినట్లైతే అవి దుర్వినియోగం చేయడానికి వీలు కాకుండా ఉంటుంది. తరువాత ప్రభుత్వ శాఖలతో వ్యవహారాలు జరప డానికి మట్టుకు ఉపయోగించవచ్చు. కాబట్టి ఆ రూపంలో సౌకర్యం కల్పించి నట్లైతే అది ఒక ఉపయోగకరమైనటువంటి విషయం. ఇప్పుడు దాన్ని శాసనం చేయడం విషయంలో పార్లమెంటరీ కార్యదర్శులయొక్క అవసరం లేదని నేను అనుకుంటున్నాను. ఇప్పుడు దీనిలో ఆ ప్రొవిజన్ లేకుండా చేయడం ఒకటి, మంత్రుల జీతాలు తగ్గించడం ఒకటి, శాసన సభ్యులకు సర్వీస్ స్టాంపు్ని ఇప్పించటం ఒకటి మనం చేయ వలసి ఉంది. ఈ అవకాశం కల్పించాలని కోరుతూ నేను విరమిస్తున్నాను.

The House then adjourned for lunch.

[After lunch : 3 p. m.]

Mr. SPEAKER :—We will now take up discussion on the amendment relating to the Bill being referred to a Select Committee.........

* Sri M. VENKATA SUBBA REDDI:—అధ్యక్షా, యింతకు ముందు మిత్రులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ప్రతిపాదించిన సవ రణ, ఆయన దానిమీద యిచ్చిన ఉపన్యాసము యొక్క సారాంశము ఇది. ముఖ్యంగా శాసన సభ్యులమైన మనము, మంత్రులు తిరిగీ త్యాగం చేయవలెనని నా అభిప్రాయం. దేశంలో ఎంతో మంది వేరు వేరు విధంగా త్యాగాలు చేశారు. స్వారాజ్య సంపాదన సందర్భంలో జాతీయ కాంగ్రెసు నాయకత్వాన అసంఖ్యాకమైన దేశ భక్తులు, అర్థికంగా, శారీర కంగా, విద్యావిషయకంగా, పరి పరి విధాల త్యాగాలు చేసి ప్రజలలో ఉత్సాహ ఉద్రేకాలను రగుల్కొల్పి రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించు టకు తోడ్పడ్డారు. అలాగే ఆర్థిక స్వాతంత్ర్య సంపాదన విషయంలో కూడా

రాజకీయంగా నైరాశ్యత వ్యాపించిన నేటి దినాలలో ప్రజలలో కార్యదీక్షను పెంపొందింపజేసి నూతనోత్సాహాన్ని కల్పించుటకు బాధ్యత గల ప్రజాప్రతినిధులు తిరిగి త్యాగం చేయటం ఎంతేని అవసరం. త్యాగం చేయటం అవసరమని గుర్తించినప్పుడు, కనీసము తమ స్వవిషయములోనైనా ప్రజల ద్రవ్యాన్ని అవసరానికి మించి అనవసరంగా పుచ్చుకోకుండా మానుకోవడమే ఒక విధంగా త్యాగం చేయటం. ఆ విధంగా ప్రజా ద్రవ్యాన్ని వినియోగించడంలో పొదుపరితనాన్ని ప్రదర్శించి ఆదర్శంగా సంచరిస్తే ప్రజలు కూడా నాయకుల అడుగుజాడలనే అనుసరిస్తారు.

ఆ విధంగా బత్తాలు తగ్గించుకోవడం వల్ల ఆర్థికస్థోమతలేక నియోజక వర్గంలో తిరిగి సక్రమంగా పనిచేయలేమని కొంతమంది శాసన సభ్యులు వాదిస్తున్నారు. ప్రజాప్రతినిధులు నిత్యమూ ప్రజల్లో సంచరిస్తూ ప్రజల నుండి సేకరించిన విరాళాలద్వారా, వారి సహకారంతో పార్టీలను నిర్మించాలి గాని ప్రభుత్వ ఖజానా నుండి అమాంతంగా లభించిన ద్రవ్యంద్వారా ప్రజాసేవ జరుగుతుందని ఆశించటం చాలా పొరపాటు. అలాగైతే మహారాజులంతా తమ ద్రవ్యపుసంచులంతా వెచ్చించి రాజకీయ పార్టీలనన్నింటినీ కొనేసి వుండేవారు. బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని చూసినట్లైతే ఒక్కొక్క కార్మికుడు నెలవారీగా నాలుగణాలు, ఎనిమిదణాలు సభ్యత్వ రుసుం చెల్లించి లక్షోపలక్షల సంఖ్యలతో కార్మిక సంఘాలుగా ఏర్పడి వర్గ పోరాటం ద్వారా సమిష్టి హక్కుల కొరకు పోరాడి సాధించుకొనుట గమనించవచ్చును. పావలా, అర్ధరూపాయి చందాగా యిచ్చిన ప్రతి పౌరుడు ఆ ఉద్యమంలో తమ బాధ్యత వున్నదని గుర్తించి తత్ పోరాటంలో సంపూర్ణంగా పాల్గొని కృషి చేస్తాడు.

మరికొందరు శాసనసభ్యులు బత్తాలరూపకంగా వచ్చిన డబ్బును తమ స్వార్థానికికాక ప్రజల కొరకే ఏర్పడిన పార్టీ కొరకై వినియోగిస్తున్నామనీ వాదిస్తున్నారు. ప్రభుత్వ ఖజానాలోని ద్రవ్యం ఏ ఒక్క రాజకీయ పార్టీకి చెందిన వారిదిగాక వివిధరకాల భావాలుగల ప్రజలది. అందుచేత ఫలానా ఆశయంగల పార్టీనిధికి అని బహిరంగంగా చెప్పి ప్రత్యేకంగా ప్రజలనుండి ఒప్పించి సేకరించి వినియోగించాలిగానీ, పరోక్షంగా ఉమ్మడి ద్రవ్యాన్ని ఈ విధంగా వినియోగించటం నీతిదాయకంకాదు అని నా వాదన.

ప్రజాప్రతినిధులు మూడవ తరగతిలోనే ప్రయాణం చేయాలన్న

[Sri M. Venkatasubba Reddi] [1st December 1953

అభిప్రాయానికి నేను ఎందుకు ఎక్కువగా ప్రాధాన్యత నిస్తున్నానంటే, ఈనాడు రైళ్లలో 30 మంది ప్రయాణం చేయవలసిన పెట్టెలో 90 మంది ప్రయాణం చేస్తూ మానవుడు మానవుడుగా సంచరించుటకు వీలులేక పశువులకంటే అధ్వాన్నంగా పరిగణించబడుచుండుటచేతనే, ప్రజా ప్రతినిధులైన శాసనసభ్యులు పార్లమెంటు సభ్యులు, మంత్రులు 3వ తరగతిలో ప్రయాణం చేస్తే ప్రజల కష్టాలు కండ్లారా చూస్తారు. కేంద్ర ప్రభుత్వం కండ్లు తెరుస్తుంది. I క్లాసు, II క్లాసు, III క్లాసు, ఇంటర్ క్లాసు అని పరి పరి విధాలుగా ప్రజలను సాంఘికంగా చీల్చేదానికంటే వర్గ రహిత సమాజం కావాలనే ఈ ప్రభుత్వపు ఆశయమైతే ఈ తరగతులనంతా రద్దుచేసి, ఒకే తరగతి పెట్టెలతో అన్ని రైలుబండ్లనూ జనతా ఎక్స్‌ప్రెస్‌లుగా మారుస్తే బాగుంటుందని సూచిస్తున్నాను. శాసన సభ్యుల జీతాలు కూడా 150 నుండి 100 కు తగ్గించాలి అనే అభిప్రాయంతో నేను ఏకీభవించలేను. ఎందుకంటే దేశంలో నెలకు రు. 100 కు తక్కువ లేకుండా రు. 100 కు మించకుండా ప్రతి పౌరునికి సంపాదన వుండవలెనని నా అభిప్రాయం. మంత్రులకు నెలకు రు. 500 జీతము, ఇంటి అలవెన్సు రు. 250 కారు అలవెన్సు రు. 250 మొత్తం రు. 1000 అవుతుంది. శాసనసభ్యునకు నెలకు రు. 150 జీతం, సగటు బత్తాలు అంతాచేరి నెలకు ఏ పరిస్థితుల లోనూ రు. 300 మించదు. అందుచేత శాసనసభ్యుల జీతాలు పరిమితికి లోపుగానే వున్నవి కాబట్టి తగ్గించ నవసరం లేదు.

స్వరాజ్యం సంపాదించిన తర్వాత ప్రజల సమస్యలన్నీ పరిష్కారమై రామరాజ్యమే ప్రతిష్ఠించబడుతుందని నాయకులు వాగ్దానం చేశారు. స్వరాజ్యం వచ్చి ఆరు సంవత్సరములైనను ప్రజల కష్టాలు అలాగే వుండిపోయినవి. ఆంధ్రరాష్ట్రము వచ్చిన తర్వాత తెలుగుదేశం సస్యశ్యామల మవుతుందని నాయకులు చెప్పారు. కాబట్టి చరిత్ర చర్విత చర్వణం కాకుండా ప్రతినిధులు తమ త్యాగాలద్వారా ప్రజలలో విశ్వాసాన్ని కల్పించాలి.

మంత్రులకు అధిక జీతాలిచ్చి, I క్లాసులో ప్రయాణాలు ఏర్పాటుచేసి, అంతఃపురాల్లాంటి భవనాల్లో నివాసాలేర్పరచి మహా వైభవోపేతమైన జీవితానికి అలవాటుచేసి ప్రజలకు దూరం చేస్తున్నాము. మంత్రి పదవులు ఆకర్షవంతం చేసి ప్రతివారూ వాటికొరకై పోటీలు చేస్తున్నాము. మంత్రి

1st December 1953] [Sri M. Venkatasubba Reddi]

పదవి నిర్వహించడం ముండ్లకిరీటం ధరించడం వంటిదని, మంత్రులు గుర్తించేటట్లు చేయాలి. అప్పుడే ప్రజల కష్టాలు ఈడేరుతవి.

అందుచేత నేను ఈ సవరణను బలపరుస్తున్నాను.

ఈ నాడు ఆంధ్ర ప్రభుత్వము గుడారాలలో ఉంటున్నది. గుడారాల ప్రభుత్వం అయిపోయింది. ప్రభుత్వోద్యోగులకు గుడారాలు చాలా అసౌకర్యంగా ఉంటున్నవి. ప్రభుత్వము ప్రభుత్వోద్యోగులను ఇటువంటి అసౌకర్యములకు లోనుచేయకూడదు. మంత్రులు మాత్రము మహా వైభవంగా భవనాలలో ఉంటూ, ఉద్యోగులను ఈ విధంగా గుడారాలలో ఉండనివ్వడం సరియైనది కాదు. అందుచేత, వారికి వెంటనే తగు వసతి సౌకర్యములను కలిగించుట ప్రభుత్వముయొక్క బాధ్యత అయియున్నదని మనవి చేస్తున్నాను. ఏ ప్రభుత్వము యొక్క సామర్థ్యంగానీ ఉద్యోగుల సంతృప్తిపైన, సౌకర్యాలపైనా ఆధారపడి వుంటుంది. ఉద్యోగులు తాము ప్రస్తుతం అనుభవిస్తున్న అసౌకర్యాన్ని లెక్కచేయకుండా వుండాలంటే మంత్రులు కూడా ఆదర్శంగా గుడారాలలో నివసించుటకే నిశ్చయించుకుంటే, ఉద్యోగులలో ఒక నూతన విశ్వాసం ప్రభుత్వంపై అంకురిస్తుంది.

Sri M. LAKSHMANASWAMI :— అధ్యక్షా, ఇపుడు మనము మంత్రులయొక్క, శాసనసభ్యులయొక్క జీతాలగురించి చర్చిస్తున్నామనే విషయము అందరికి తెలుసును. ఇది స్వవిషయము. మంత్రులు శాసనసభ్యులు మన మందరంకూడ ప్రభుత్వంనుండి జీతాలు, అలవెన్సులు తీసుకొనేటటువంటి విషయం గనుక, ఇది ప్రజల ధనముగా భావించి అతి జాగ్రత్తగా పరిశీలించవలసి యుంటుంది.

ఈ బిల్లుకు నేను కొన్ని సవరణలు సూచించడం జరిగింది. దానిలో ఒక సవరణ Parliamentary Secretaries ను గురించిన ప్రస్తావన ఇందులో ఉండకూడదని ఇచ్చినాను. దీన్నిగురించి నా మిత్రులు ఇదివరకు మాట్లాడడం జరిగింది. నేను ఒక విషయాన్ని చర్చిస్తాను. ఇంతవరకు మనము మద్రాసురాష్ట్రంలో ఒక భాగముగామాత్రమే ఉండడం జరిగింది. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రం ఏర్పడడంతో, మనము ప్రత్యేకముగా ఒక 10 జిల్లాల పరిపాలననుమాత్రము నిర్వహిస్తున్నాము. అలాంటప్పుడు మంత్రులే కాకుండా ఇంక ఇతర సిబ్బందినికూడ చేర్చడమంటే, మన ప్రభుత్వానికి

[Sri M. Lakshmanaswami] [1st December 1953

ఒక తలంబరువును సృష్టించినట్లవుతుంది. ఆ రకంగా ప్రజలయొక్క ద్రవ్యమును దుర్వినియోగం చేయవలసిన అవసరం ఏముందనే విషయాన్ని పరిశీలించాలని మీ యందరిని కోరుచున్నాను. శాసనసభ్యుల జీతాలగురించి క్రిష్ణమూర్తిరావుగారు ఇందాక మాట్లాడుచూ, ఇప్పటి జీతాలు చాలవని, మరొక వంద రూపాయలు అవసరమని చెప్పారు. ఈ అభిప్రాయముతో నేనేకాకుండా, కమ్యూనిస్టుపార్టీకూడ ఏకీభవించడంలేదని చెప్పడం నా కర్తవ్యం అని అనుకొంటాను. క్రిష్ణమూర్తిరావుగారు దీన్నిగురించి చెపుతూ, కొన్ని సూత్రాలుకూడ చెప్పడం జరిగింది. ఈ జీతము వారి ఖర్చులకు సరిపోదనియు, ఎలెక్షన్ల ఖర్చులుగూడ గిట్టవనియు చెప్పారు. ఇక్కడ ఒక విషయాన్ని చూడవలసియున్నది. ఎన్నికలలో పాల్గొనే సందర్భములోను, తరువాత నిర్వహణ సందర్భములోను, సభ్యులు కొన్ని వందలు ఖర్చుచేసియుండవచ్చును. అది నిజమే కావచ్చును. కాని జీతాలద్వారా, వాటిని రాబట్టుట సబబుకాదు. ఈ సందర్భములో, శాసనసభ్యుల గురించి ప్రజలలోగూడ ఒక అభిప్రాయ ముంటుందని గమనించవలసి యున్నది. సాధారణంగా శాసనసభ్యులు తమ నియోజకవర్గాలలో తిరిగేటప్పుడు, చిన్న కార్లలో పోకుండా నడిచిపోయినట్లైతే వారి హోదాకు తక్కువగా భావింపబడుచున్నది. క్రిష్ణాజిల్లాలో చాలాచోట్ల ఈ విధంగా చూచాను. కనుక శాసనసభ్యులు తమ గ్రామాలలో తిరిగేటప్పుడు చిన్న కార్లు తీసుకొని వెళ్లవలసి వస్తున్నది. అయితే ఇక్కడ ఒక సమస్య వస్తున్నది. ఈ కార్లకు డబ్బు ఎక్కడనుంచి వస్తుందనే ప్రశ్న ఉన్నది. ఈ విషయములో శాసనసభ్యులగురించి ప్రజలకు కొన్ని అభిప్రాయాలుంటున్నవి. ప్రభుత్వము నుంచి కొన్ని పద్ధతులలో వీరికి ఇంత ఆదాయము ఉంటుందని అనుకొంటారు. లేకపోతే వీళ్ళకు ఇచ్చే జీతముతో ఈ విధంగా చిన్న కార్లలో తిరుగగలరా అని అనుకొంటారు. ఏమైనప్పటికి శాసనసభ్యులకు ఇచ్చే టువంటి బత్తా రోజుకు రు. 12-8-0 ఉండడంచేత వారికి రోజుకు ఇంత ఖర్చు ఉండదు కాబట్టి, మిగిలినది నియోజకవర్గములో ఖర్చుకు ఉపయోగించుకొంటున్నారని అనుకోవచ్చును. ఈ సందర్భములో వావిలాల గోపాలకృష్ణయ్యగారు శాసనసభ్యుల జీతము వంద రూపాయలకు తగ్గించాలని ఒక సవరణ ఇచ్చారు. ఆ వ్యక్తియొక్క అవసరాలు తక్కువగా ఉండవచ్చునేమో! అందుకని, అందరికి ఆ విధంగా ఉంటుందని అనుకోకూడదు. మరి కొంతమంది ఈ జీతాలు చాలవు ఎక్కువ చేయాలని అంటున్నారు.

ఈ రెండు అభిప్రాయాలను పరిశీలించి చూస్తే, ఇప్పుడున్న జీతమే సరిగా ఉంటుంది. దీన్ని తగ్గించడమంటే కొంతమంది శాసనసభ్యులకు, చాల కష్టముగా ఉంటుంది. ఎందుకనగా ఈ శాసనసభ్యులలో కొంతమంది, ఇతర ఆదాయంలేక కేవలము దీనిపైన ఆధారపడియున్నవారుగూడ ఉన్నారు. అటువంటివారికి కష్టముగా యుంటుంది. కనుక అటువంటివాళ్ళనుకూడ దృష్టిలో పెట్టుకొన్నప్పుడు, ఈ 150 రూపాయలు ఎక్కువగాదు. అందువల్ల దాన్ని ఆ విధముగానే ఉంచవచ్చును. ఇక కొన్ని అదనపు విషయాలనుగురించి కొంత చూడవలసిన అవసరమున్నదని కొన్ని సవరణలలో సూచించడం జరిగింది. వీటిలో వైద్య సౌకర్యము మొదలైనవి ఉన్నవి. అయితే 150 రూపాయలను తగ్గించేపట్ల ఇవి అవసరమేమోగాని, తగ్గించనప్పుడు అవసరము లేదనుకొంటాను. ఎందువల్లనంటే ఈ జీతము అంత చాలకపోయినప్పటికి, రు.12-8-0 అలవెన్సు ఉంటుంది గనుక మొత్తముమీద ఇస్తున్నటువంటి జీతము అలవెన్సులు కలసి, మన కనీస కర్తవ్యాలను నిర్వహించుకోడానికి సర్దుబాటు చేసుకోవచ్చును. కనుక శాసనసభ్యుల విషయములో కొత్తగా సవరణలేవి అవసరము లేదనేటటువంటి విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, నేను ప్రతిపాదించిన సవరణలను ఉపసంహరించుకొంటూ, మంత్రుల విషయములో వారికి కారు అలవెన్సు, ఇంటి అలవెన్సులు ఇవన్నీ వస్తున్నాయి గనుక వారి జీతము అయిదువందలకు తగ్గించుట సవ్యంగా ఉంటుంది. తరువాత పార్లమెంటరీ సెక్రటరీలకుగూడ జీతాలు తగ్గించాలి. ఈ రెండు విషయాలను బలపరుస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

* Sri T. MALLAYYA:—అధ్యక్షా, మనము యిప్పుడు రాష్ట్రములోవున్న ఏ సమస్యనుగూడ చర్చించడములేదు. మన స్వంత విషయాన్నిగురించి చర్చించుకుంటున్నాము. స్వంత విషయాన్నిగురించి ఎట్లు మాట్లాడినను మనకు అది చెడుగానే వుంటుంది. అయితే ముఖ్యమైన 3-20 p.m.
Gazetted Officers వలె మనకు వున్న హోళనకు తోడు దీన్ని నేను అన్యాయమని భావిస్తున్నాను. ఎందుకంటే ఒక గజెటెడ్ ఆఫీసరుకు జీతము నిర్ణయించే హోదాలో మనము లేనట్లు నేను భావిస్తున్నాను. రెండవది: వాళ్ళకు యిచ్చే జీతములు, ఎలవెన్సుల విషయము. ఈ శాసనసభ్యులయొక్క స్థితి యీ విధంగా ఉన్నది అని అంటున్నాను. నేను జరిగే

[Sri T. Mallayya] [1st December 1953

టటువంటి స్థితినిగురించి నేను చెబుతున్నాను నమ్మండి. ఈ విషయము యిప్పుడు మీా ముందు పెట్టుతున్నాను. శాసనసభలో పాల్గొనేందుకు నిజంగా చాలామంది ప్రజలు సభ్యులను ఎన్నుకోవడము జరుగుతున్నది. శాసనసభ్యులలో అందరిని ఒకే రకమైన ఆదాయముగలవారుగా పేర్కొన వీలు లేదు. నిజానికి యీా శాసనసభ్యులలో చాలామంది పేదవారు వున్నారు. ఉభయ పక్షాలలోను చూస్తే, శ్రీ శంకరరెడ్డిగారు మూడు వందల యకరములుగలవారు. మాలో చాలామంది అల్పాదాయము గలవారున్నారు. మా మాదిరిగ ఒక్కొక్కరు పది యకరములు, అయిదు యకరములు, యింకా తక్కువ భూవసతిగలవారు వున్నారు. వారి స్థితి వాస్తవముగా చాలా అన్యాయముగా వుంటున్నది. కాబట్టి మాలో చాలామంది ఎన్ని కష్టాలు పడుతున్నప్పటికి, ఎన్నో బాధలు పడుతున్నప్పటికి నిజముగా ప్రజా ప్రతినిధులుగా వుండి యీా బాధ్యత నిర్వహించ టానికి వచ్చినప్పుడు, sincere గా మా నియోజకవర్గములోనున్న ప్రతి గ్రామానికి కష్టపడి వెళ్లి, కూలి నాలి చేసుకునే బీదప్రజల కష్టములను విచారించి వారి స్థితిగతులు గవర్నమెంటుకు సరిగా represent చేయ దలచినప్పుడు, ప్రభుత్వము ఎన్ని తప్పులు పట్టుతున్నప్పటికి, ఎన్నో అసౌక ర్యాలు వున్నప్పటికికూడా, యీా సమయములో యీా జీతముల విషయము వచ్చేటప్పటికి మేము తగుమైన జీతము, సౌకర్యాలు ప్రభుత్వమునుండి కోరలేకపోతున్నాము. ఈ పరిస్థితులు అన్నియు అందరికి తెలిసినవే. ఈ విషయములు ప్రభుత్వపక్ష సభ్యులనుండి వస్తే, మాలో మేము ఏదో విధంగా సమర్థించుకుంటున్నాము అని అంటున్నారు. గవర్నమెంటువారిని అడిగితే, మేము ఎట్లాగో కష్టాలకు ఓర్చుకుంటున్నాము అనడం జరుగు చున్నది. సాధారణముగా ఈ అసౌకర్యాలనుగురించి ఎందుకు విమర్శి స్తున్నారో గమనించవలసి యున్నది. గవర్నమెంటును మరచిపోయి యిది ఒక సంసారపక్షంగా ఆందోళన చేస్తున్నారు. మన లక్ష్మణదాసుగారు యింకను వేరే సౌకర్యాలుకూడా కావాలని అంటున్నారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రి ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారి గారి హయాములో గవర్నమెంటు non-gazetted officers కు యిచ్చిన free medical aid ఈ నాడు శాసనసభ్యులకుకూడా యివ్వాలని అంటు న్నారు. ఈ సౌకర్యములు మాకు లేకుండాచేస్తే, మాకు చింత లేదు. ఎవరి వల్లను ఎక్కడకూడా చేయబడలేదు. ఎందుకంటే మేము సాధారణముగా

1st December 1953] [Sri T. Mallayya]

మంచి గాలివుండే ప్రదేశాలలో మేము మొదటినుంచి మా పొలములలో తిరుగుచూ కష్టించి పనిచేసేవాళ్ళము. కాబట్టి, మేము విశేషముగా జబ్బులతో బాధపడము గనుక, మాకు యీ free medical aid కావాలని కోరడములేదు. మా అవసరాలనుబట్టి మేము ఖర్చు చేస్తూ ఉంటాము గనుక, మాకు రోగాలు సులభముగా రావు అని అంటున్నాను. అందువల్ల ఆ సౌకర్యములు వాళ్ళకు వుండనియ్యండి. ఈ శాసనసభ్యుల నిజ పరిస్థితులు నేను వివరించినప్పుడు మీరు నమ్మండి. మాకు సాధారణముగా రోగాలు రావు. కాబట్టి మాకు ఆ సౌకర్యాలు అవసరములేదు. ప్రతి నెలలో, ఏ నాలుగురోజులలో విశ్రాంతి తీసుకొని, తతిమ్మా రోజులలో మేము ప్రజాసేవ చేస్తున్నాము. ఇక్కడికి వస్తేనే మాకు యీ bath room సౌకర్యాలు చింత వుంటుంది. ఒక్కొక్క హోటలులో ఒక గదికి ఇద్దరు, వుంటూంటే, యిక్కడ అనగా శాసనసభ్యుల రూములలో ముగ్గురు మొదలు ఆరుగురువరకూ వుంటున్నారు. ఇక్కడ గదికి ఒక్కొక్కరికి దినమునకు రూము అద్దె, రెండు రూపాయలు ఖర్చుపెట్టవలసివస్తే, నెలకు ముగ్గురు బసచేసే ఒక రెంటుకు 180 రూపాయలు అద్దె అగుచున్నది. అటువంటప్పుడు శాసనసభ్యులకు యిచ్చే జీతములో కొంత తగ్గిస్తామంటే, యిక వారు ఖర్చులు ఏవిధంగా భరించుకొని ప్రజాసేవ చేయగలరో అర్థము కావడములేదు. శాసనసభ్యులు 3 వ క్లాసు రైలుబండిలో ప్రయాణము చేయమంటే, నాల్గవక్లాసుబండి వుంటేగూడా ప్రయాణము చేయమని సలహా యివ్వటానికి సిద్ధపడితే, మాకు అభ్యంతరము వుండదని శ్రీ బి. కృష్ణమూర్తిరావుగారు అంటున్నారు. అయిదవక్లాసు బండిగూడా వుంటే, అందులోగూడా ప్రయాణము చేయటానికి యిష్టపడుతున్నాము అని నే నంటున్నాను. కాబట్టి శాసనసభ్యులకు వున్న అసౌకర్యాలు ప్రభుత్వము ఆలోచిస్తారని అనుకుంటున్నాను. దీని విషయములో సరియైన చర్య ప్రభుత్వము తీసుకుంటుందని ఆశిస్తున్నాను.

తరువాత travelling allowance విషయము చూస్తే యిప్పుడు తగ్గిస్తామంటున్నారు. నాకు యిప్పుడు 16-0-0 రూపాయలు మాత్రమే ఇస్తున్నారు. ఎందుకు తగ్గించారని అడిగితే, రూల్సు revise చేశారని అన్నారు. దాని కేమి కష్టములేదు. T. A. విషయములోకూడా మేము కొట్లాడదలచలేదు. ఒక శాసనసభ్యుడు తన నియోజకవర్గములో ప్రతిరోజు

[Sri T. Mallayya] [1st December 1953

తిరిగి పనిచేసే పక్షములో ప్రభుత్వము యిచ్చే యీ 150/- రూపాయలు బైట ఖర్చులకే చాలీ చాలకుండా సరిపోతున్నది. ఇంకను జాస్తిగానే ఖర్చు అవుతున్నది. సందేహించ నవసరములేదు. ఈ విషయము ప్రభుత్వము గుర్తించాలి. కృష్ణారావుగారు మరొక విషయము చెప్పారు. అది ఎప్పటి విషయమో మాట్లాడారు. మా నియోజకవర్గములో తిరిగేటప్పుడు యింకను మా గ్రామాలలో వున్నప్పుడుగూడా మాకు postage క్రింద నెలకు 15/- లేక 16/- రూపాయలదాకా ఖర్చు అవుతున్నది. ఇదిగాక బైట వూరు వెళ్ళినప్పుడు హోటలు ఖర్చులతో సహా అంతయు చేరి మాకు ఒక్కొక్కరికి ఎంత ఖర్చు చేయవలసి వుంటుందోగూడా ప్రభుత్వము గుర్తించాలి. ఏదైనా ఒక విషయంలో enquiry కి గాను మా నియోజకవర్గములోనికి వెళ్లినప్పుడు మా ఖర్చులు ఎంత అగునో ఆలోచించ మంటున్నాను. దీన్నిబట్టి చూస్తే, మాకు ప్రభుత్వముయిచ్చే 150/- రూపాయల జీతములో మాకు నిజంగా మిగిలేది యేమి వుండదు. శంకర రెడ్డిగారిని అడిగితే, ఖర్చు విషయము ఆలోచిస్తే వారు ఎలెక్షనులో ఎంతో డబ్బు ఖర్చుచేశామని అన్నారు. వారు ధనికులు, కాబట్టి వారు ఎంతైనా ఖర్చు చేయగలరనుకుంటాను. మేము రెవెన్యూ ఇన్స్పెక్టర్ల వలె మా నియోజకవర్గములో నెలకు 24 రోజులు తిరుగవలసియున్నది. ఖచ్చితంగా, నిర్మొహమాటంగా నెలకు వారు తిరిగేమాదిరి 24 దినములు మా నియోజకవర్గములో తిరుగుతాము గనుక మా ఖర్చులను, కష్టాలను ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని ఆలోచిస్తే, నిజానికి మేము కోరేది మాకు యివ్వవలసి యుంటుంది. ఎంతో బాధ్యత అనేది మామీద వున్నది గనుక, మాకు ప్రభుత్వముయిచ్చే జీతము మా ఖర్చులకే చాలదు గనుక, యీ సొమ్ము మేము జీతముగా భావించడములేదు. ఈ కారణముచేత ఈ సొమ్మును మాకు జీతము అని పిలువక, ఆనరోరియం అని అంటే మేము సంతోషిస్తాము. అంతేకాకుండా, ప్రభుత్వమునుంచి యీ మధ్య నాకు నా జీతము relinquish చేస్తావా, అని నా అభిప్రాయముకోరకు ఒక communication వచ్చింది. నేను ఏమాత్రము త్యాగించటానికి వీలులేదని నిర్మొహమాటంగా జవాబు వ్రాశాను. ప్రభుత్వమువారిచ్చే యీ 150/- రూపాయలలో నాకు రూము rent క్రింద 60/- రూపాయలు పోగా, నాకు మిగిలేది స్వల్పమే గనుక, ఏమాత్రము తగ్గించటానికి వీలులేదని ప్రభుత్వానికి వ్రాశాను. రెవిన్యూ యిన్స్పెక్టరు

1st December 1953] [Sri T. Mallayya]

గారిమాదిరి మేముగూడా కష్టించి పనిచేస్తున్నాము గనుక మాకు యీ జీతము చాలదు కాబట్టి, యింకను నేను ప్రభుత్వపక్షములో వున్నందున యీ 150/- రూపాయలనుంచి 200/- రూపాయలకు పెంచితే మాకు యిబ్బంది వుండదనికూడా అంటున్నాను.

ఇటు Mysore, హైదరాబాదు, పార్టు B స్టేట్సు వాళ్ళు 200 రూపాయలు జీతం పుచ్చుకుంటున్నారు. దానితో compare చేసుకున్నప్పుడు మన రాష్ట్రంలోని స్థితి ఏమిటి? బొంబాయిరాష్ట్రం విడిచిపెట్టండి. అక్కడ standard unique. తక్కువ పుచ్చుకొని ఎక్కువ సర్వీసు చేసినవారమవుతాము. ఇంటి allowance విషయం ఏమి చేసినా సరే. ఇన్నూరు రూపాయలిచ్చినా దోషంలేదని మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER:—Select Committee కి ఈ బిల్లు పంపించే సవరణమీద discussion ఇంతటితో close చేస్తున్నాను. జీతాలు 10 వందలనుంచి 6 వందలకు తగ్గించవలసినదని సవరణ లున్నాయి. వాటిమీద discuss చేయుటకు అవకాశం ఉన్నది. అందువల్ల close చేయడము మంచిదని అంటున్నాను.

Sri T. NAGI REDDI :—I think the Government must be given a chance to reply to the debate. Even if the Chief Minister is not here, the Deputy Chief Minister may reply. As the Leader of the Opposition, naturally I expect I will also be called upon to speak.

Mr. SPEAKER :—The Deputy Chief Minister will now address the Assembly.

The Hon. Sri N. SANJEEVA REDDI:— అధ్యక్షా, చిన్న విషయంపై చాలామంది మాట్లాడారు. మిత్రు లిచ్చిన సలహాలు బాగానే వున్నవి కాని దీన్ని Select Committee కి పంపడం ఎందుకో నాకు అర్థంకావడంలేదు. ప్రతి రాష్ట్రంలోనూ ప్రతితూరి జరుగుచున్న చర్చే, ప్రతి రాష్ట్రంలోనూ budget session వచ్చినప్పుడల్లా జరుగుచున్న చర్చే. ప్రభుత్వం ఇస్తూఉన్న జీతాలు ఇతర రాష్ట్రాలతో పోల్చిచూచినా, పరిస్థితులను పోల్చిచూచినా మంత్రులకే కాదు, శాసనసభ్యులకుకూడా జీతాలు

[Sri N. Sanjeeva Reddi] [1st December 1953

ఎక్కువని చెప్పుటకు వీలులేదు. ఈ రాష్ట్రంకన్న ఇతర రాష్ట్రాల జీతాలు ఎక్కువగా ఉన్నవని అనుకుంటూ యున్నాను. ఇప్పుడు మంత్రుల జీతాలు హెచ్చించుకొనక పోవడమేకాక మంత్రులు house allowance 250 రూపాయిలు తీసుకోకుండా గవర్నమెంటు వారిచ్చిన ఇండ్లలో ఉండి, ఆ బాడుగ గవర్నమెంటువారే ఇచ్చునట్లు ఏర్పాటుచేసుకున్నాం. కర్నూలు పట్టణం చిన్నది కావడంవల్ల, ఇక్కడ పెద్ద ఇండ్లు లేకపోవడంవల్లనూ ఏ ఇంటికి 100 రూపాయిలకన్న ఎక్కువ బాడుగలేదు. ప్రకాశంగారి ఇంటికి 100 రూపాయిలు. సంజీవయ్యగారింటికి 50 రూపాయిలు. నా ఇంటికి ఇంకా fix చేయలేదు. కాబట్టి 250 రూపాయిలు పుచ్చుకోవడం అనవసరమనీ, ఆ ఇవ్వవలసిన బాడుగ గవర్నమెంటే ఇచ్చునట్లు, ఈ రకంగా వీలైనచోట ఏర్పాటు చేసుకుంటూ ఉన్నాము. జీతం, భత్యం ఎక్కువగా లేదని మంత్రులుగాని ఎవ్వరూగాని అనడంలేదు. విశేషంగాలేదు (నవ్వు) ఎందు కనగా మంత్రులనేవారు కొంచం ప్రత్యేకమైన వసతులతో (నవ్వు) న్యాయంగా పరిపాలనచేస్తూ కొద్దిపాటి సుఖం — పనిచేయుటకు కావలసినంత సుఖం అనుభవిస్తూ—మాటిమాటికీ ఇంట్లో నేతికి డబ్బు లేదు, పిల్లలకు స్కూలు జీతాలు కట్టుటకు డబ్బులేదనే స్థితిలో బాధ పడకుండా ఒక్క రాష్ట్రంలోనే కాకుండా మిగిలిన రాష్ట్రాలలో కూడా ఏర్పాటు చేశారు. ఈ పద్ధతులలో 75 రూపాయిలు ఇస్తూయున్న ఎసెంబ్లీ సభ్యులకు హెచ్చించడం జరిగింది. అది ఎక్కువ అనుకోను. శాసనసభ్యు లకు 150 రూపాయిలు ఇవ్వడం చాలా తక్కువ అని మల్లయ్యగారు చెప్పిన విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. వారు శాసనసభ్యుల విషయం చెప్పారు. నేను మంత్రుల సమాచారం చెప్పడం అవసరంలేదు. ఐతే మంత్రుల విషయం చెప్పవలెనంటే వారు ఎనిమిదిమందే. మిగిలినవారు 130 మంది. అందరమూ కలిసి సంసారపక్షంగా పోవాలని చూస్తున్నా మని అన్నాను. Ordinance ఎందుకు issue చేశారని గోపాలకృష్ణయ్య గారు అన్నారు. వద్దనుకున్నాం. మద్రాసులో ఉన్న చట్టమే ఇక్కడా ఉపయోగపడుతుందని అనుకొన్నాం. అది examine చేసి, re-examine చేసి ఒక lawyer ఇల్లా చెబితే ఇంకొక lawyer అల్లా చెప్పారు. Ordi-nance ఉపయోగించడంవల్ల ఎవరికీ ఉపయోగంలేదు. Examine చేశారు. Legal advice ఇచ్చి...

1st December 1953]

Sri T. Lakshminarayana Reddi పార్లమెంటరీ కార్యదర్శులను నియమించమని హామీ ఇచ్చారా?

The Hon. N. Sanjeeva Reddi :—

ఇంకా చెబుతున్నాను కదండి. ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకమైన ప్రభుత్వం లేదు కాబట్టి Adaptation Act దానికిమాత్రం apply కాదనే legal opinion వల్ల మేము అట్లా చేయవలసివచ్చింది. ఈ ordinance ను చట్ట సమ్మతంగా చేయడమే తప్ప ఇతర కారణాలు లేవు. మిలిగిన విషయాలు సభ్యులు తెలియజేశారు. సులభంగా III class లో ప్రయాణంచెయ్యాలి, బత్తాలు తక్కువ తీసుకోవాలనే విషయం చెప్పినారు. అది realistic గా లేదని చెప్పదలచుకున్నాను. మేమంతా III class లో ప్రయాణ చేసిన వాళ్ళమే. III class లో ప్రయాణం చేసినప్పుడు చేశాం. second class లో ప్రయాణం చేశాం. first class లో ప్రయాణం చేయవలసివచ్చినప్పుడు చేస్తాం. ఇతరరాష్ట్రాలలో ఏమి అనుసరిస్తున్నారో వాటికి పోల్చిచూస్తే బాగా ఉంటుందనే ఉద్దేశంతో చేసిన చట్టాలే కాని first class లో ప్రయాణం చేయడంవల్ల, second class లో ప్రయాణంచేస్తే ఏదో వస్తుందనికాదు. ఏ class లో చేసినా ఏమీ ఇబ్బందిలేదు. ఇవన్నీ చిన్న చిన్న విషయాలు. వీటిని గురించి ఇంత చర్చ అవసరంలేదు. లక్షలకోలదీ రూపాయిలు ఖర్చు పెడితే ఇబ్బంది ఉంటుంది. మదరాసు రాష్ట్రంలో అమలులోయున్న ఈ బిల్లు, తూ.చా. తప్పకుండా ఇక్కడ పెట్టాం. దీన్ని గురించి తర్జనభర్జన లేకుండా పాస్ చేయడంలో ఇబ్బంది లేదు. లక్ష్మీనారాయణరెడ్డిగారు పార్లమెంటరీ సెక్రటరీలను appoint చేస్తారా అని అడిగారు. పార్లమెంటరీ సెక్రటరీలు ప్రతి రాష్ట్రంలోనూ ఉన్నారు. ఈ రాష్ట్రంలో తీసుకో లేదు. అవసరం వచ్చినప్పుడు efficient men దొరికినప్పుడు, లక్ష్మీనారాయణ రెడ్డిగారి వంటి బుద్ధిమంతులు, ప్రజ్ఞావంతులు దొరికితే వారి సహకారం తీసుకోవచ్చును. వారి ప్రజ్ఞ మనకు అవసరమైనప్పుడు తీసుకుంటాంగాని, బిల్లులో ఉన్నంత మాత్రంచేత appoint చేయవలసిన అవసరంలేదు. ఇరవై మంది మంత్రులవరకూ పెంచవచ్చునని, మంత్రివర్గం విస్తరించామా? అట్లా పెంచుకొనే తలంపు ప్రభుత్వానికి లేదు. పార్లమెంటరీ సెక్రటరీలను తీసుకునే ఉద్దేశంలేదు. ఆ విషయమై మీరు సందేహాలు పెట్టుకోకండి. జీతాల పెంపకం లేకుండా, బత్తాల పెంపులేకుండా ఇది ఉన్నది ఉన్నట్లు pass చేయమని కోరుతున్నాను.

3-40 p.m. Sri VAVILALA GOPALAKRISHNAIAH :— ఇప్పుడు మన ఎదుటవున్న సంగతి ఏమిటంటే ఈ బిల్లును సెలక్టు కమిటీకి పంపాలా, అక్కరలేదా అనేది. ఈ బిల్లు సెలక్టు కమిటీకి పంపనక్కరలేదని మంత్రి గారు చెప్పివున్నారు. అందువల్ల కలిగే ఇబ్బంది ఏమిటో వారు చెప్పలేదు. Constitutional point ఒకటి చెప్పారు. నేను చెప్పినదానికి time చాలుతుందో, లేదో అని చెప్పారు. అందరూ కలిసి pass చేస్తే జీతాలు తేడా లేకుండా వస్తాయి అని చెప్పారు. ఈ బిల్లు ఈ మంత్రుల కోసం ఉద్దేశించ బడలేదని చెప్పారు. ఈ మంత్రుల కోసమే అని నేను అనలేదు. మంత్రులన్నవారి అందరికోసమే చెప్పాను. మంత్రులుగా వుండేవారి కష్టాలు మాకు తెలియవు అన్నారు సంజీవరెడ్డిగారు.

The Hon. Sri N. SANJEEVA REDDI:—మంత్రులుగా వున్నవారి కష్టాలు మంత్రులు కానివారికి తెలియవు అని మాత్రమే అన్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH.— మంత్రులుగావుండేవారి కష్టాలు నాకు తెలుసు. జీతాల విషయంలో Exchequer ముందు పెట్టవలసివుంది. మన జీతాలు మన ఆర్థిక పరిస్థితినిబట్టి ప్రజల జీవనవ్యయ ప్రమాణాన్నిబట్టి వుంటుంది. మనకు deficit తో కూడిన రాష్ట్రం వచ్చిన ఈ సమయంలో ఇది ఒక new gesture లా చూపిస్తే బాగుంటుందని నేను మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER :—The question is :

"That the Bill be referred to a Select Committee".

The amendment was put and lost.

Mr. SPEAKER :—The motion is :

"That the Bill be taken into consideration at once."

The motion was carried.

Mr. SPEAKER:—తరువాత ప్రతి clause మీద వున్న సవరణలు move చేస్తే ఎవరికి ఇష్టమైన దానిమీద వారు discussion లో మాట్లాడ వచ్చును. అందుచేత మిగిలిన సవరణలను move చేయమని కోరుతున్నాను.

There are no amendments for clause 2.

CLAUSE 2 was put and carried.

1st December 1953]

## CLAUSE 3.

Mr. SPEAKER :—The motion is :

"That clause 3 do stand part of the Bill."

Sri M. VEERABHADRAM :—Sir, I move : "For the words 'one thousand' substilute the words, 'seven hundred and fifty'."

Sri V. SRI KRISHNA :—Sir, I second the amendment.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Sir, I move :

(1) "For the words 'one thousand rupees', substitute the words 'five hundred rupees'."

(2) "For the words 'two hundred and fifty rupees' wherever they occur, substitute the words 'one hundred and fifty rupees'."

Sri M. HANUMANTHA RAO :—Sir, I second the amendments.

Sri T. LAKSHMINARAYANA REDDI :— Sir; I move : "For the words 'one thousand' substitute the words 'five hundred'."

Sri M. VENKATASUBBA REDDI :—Sir, I second the amendment.

Sri G. YELLAMANDA REDDI :— Sir, I Move :

"For the words 'one thousand' substitute the words 'five hundred'."

Sri K. GOVINDA RAO :—Sir, I second the amendment.

Mr. SPEAKER:— ఇప్పుడు సభవారి ఎదుట 3 వ క్లాజుమీద శ్రీయుతులు వీరభద్రం, వావిలాల, లక్ష్మీనారాయణరెడ్డి, యల్లమందా రెడ్డి, సీతారామయ్యగార్ల సవరణలు వున్నాయి. వాటిమీద ఎవరైనా మాట్లాడదలచుకుంటే త్వరగా మాట్లాడండి. ఒకరిద్దరికి chance ఇస్తాను. తరువాత vote కు పెట్టవలసివస్తే పెడతాను.

3-50 p.m. * Sri T. LAKSHMINARAYANA REDDI:—అధ్యక్షా, మంత్రిగారు యీబిల్లును ప్రవేశపెడుతూ ముందు Co-operative Bill లెవనే త్వరగా ఆమోదించబడవలెను అని అన్నారు. మనం మద్రాసు రాష్ట్రంనుంచి విడిపోయిన తరువాత కూడా మంత్రిగారు మామూలు పద్ధతులలోనే మాట్లాడ్డం ఆశ్చర్యంగా వున్నది. మనం కొత్తగా రాష్ట్రం ఏర్పరచుకున్నాం కనుక మన పరిస్థితుల్ని అవగాహన చేసుకోవలిసిన అవసరం వున్నది. మనది లోటు బడ్జెటు అన్నారు. కాబట్టి ముందు ముందు పెద్ద జీతపు టుద్యోగస్తుల జీతాలను తగ్గించే అవసరం వున్నది. దానికి నాందిగా యీ బిల్లును సమగ్రంగా పరశీలించవలసిన అవసరం వున్నది. అంతేగాని మంత్రిగారు చెప్పినట్లు త్వరగా ముగించడానికి వీలుండదు. మన దేశ పరిస్థితుల్ని బట్టి మన ప్రజలకున్న ఆర్థిక దుస్థితినిబట్టి మంత్రులకు యింత పెద్ద జీతం యిచ్చుకోలేరు.

మన ప్రక్కదేశం అయిన చైనాదేశంలో అధినేత మావ్‌ట్సేంగుకు మన మంత్రుల జీతాలకంటె చాల తక్కువ. మన దేశపరిస్థితి చైనాదేశం కంటే ఏ విధంగాను వున్నతస్థాయిలో లేదు. ప్రజలు ఏ పరిస్థితుల్లో వున్నారో గమనించి, కాంగ్రెసు వెనుక చేసిన వుపన్యాసాలు, ఇప్పుడు తాము అధికారంలోకి వచ్చిన తరువాత జ్ఞాపకం తెచ్చుకొని యీ బిల్లును సమగ్రంగా ఆలోచించాలని మనవిచేస్తున్నాను. మంత్రుల జీతాలు వెయ్యిరూపాయల నుండి 500 రూపాయలకు తగ్గించవచ్చునని చెప్పిన సోదర సభ్యులతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. 500 రూపాయలు చాలా తక్కువ అని మంత్రులు అనవచ్చు. దీనికి యితర రాష్ట్రాలతో పోలుస్తున్నారు. అయితే నేను చెప్పేదేమిటంటే మన రాష్ట్రంకు ప్రత్యేకమైన చరిత్ర వున్నది. దేశంలో అన్ని రాష్ట్రాలకంటె ముందుగా, అన్ని రంగాల్లో ముందున్నాం. ఆంధ్రరాష్ట్రంకోసం పోరాటం సాగించి సాధించాం. ఈ విషయాన్ని గుర్తించి మంత్రులు త్యాగాన్ని చూపిస్తారని ఆశిస్తున్నాను. వారు 500 రూపాయలతో జీవించలేరా? శాసనసభ్యుడు దగ్గరనుంచి క్రింద వరకు త్యాగంలో ఆదర్శం తీసుకుంటారు. గాంధీగారి సిద్ధాంతాల్ని జ్ఞాపకం చేస్తున్నాను. 500 రూపాయలతో వారు సక్రమంగా జీవించగలరనే భావిస్తున్నాను. ఇతర రాష్ట్రాలన్నిటికి భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణంలో ఆదర్శప్రాయంగావున్న మన రాష్ట్రం, మంత్రుల జీతాలు తగ్గించే విషయంలోకూడా ఆదర్శప్రాయంగా వుంటుందని ఆశిస్తున్నాను. దేశంలో

[Sri T. Lakshminarayana Reddi] [1st December 1953

చిన్న గుమస్తాల జీతాలు పెంచగలిగినట్లయితే మంత్రులు ఎక్కువ జీతాలు తీసుకోవడం సమర్థించవచ్చు. కాని జీవిత ప్రమాణాలు పడిపోతున్న యీ రోజుల్లో చాలీ చాలని జీతంతో గుమాస్తాలు, బడిపంతుళ్లు, పోలీసు వుద్యోగస్తులు బాధపడుతూవుంటే మంత్రులు జీతం తగ్గించుకోడానికి సందేహించడం సబబుగాలేదు. ఈ సవరణ వుద్దేశం ఏమిటంటే 500 రూపాయలు standard జీతం చేయాలని. ఒక ప్రక్క తక్కువ జీతంగల N. G. O.s జీతం హెచ్చించాలని, కనీసం జీవనభారం మోయడానికి అనువైనదిగా చేయాలని విజ్ఞప్తులతో విసిగి సమ్మెలు కట్టేందుకు తెగించినపుడు వారికి త్యాగంమీద వుపన్యాసాలు ప్రసాదిస్తూ మరోకవైపు తమ జీతంలో తగ్గించుకోమంటే సంకోచించడంలో ఏమి న్యాయం వుంది? త్యాగం చూపించవలసిన సమయము వచ్చింది. చూపించండి అని కోరుతున్నాను.

పార్లమెంటరీ కార్యదర్శుల విషయం ordinance లో వున్నది. నా వుద్దేశంలో యీ పార్లమెంటరీ కార్యదర్శి వుద్యోగం అనవసరం. ఈ విషయం మంత్రివర్గం గుర్తించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. గౌరవనీయులైన విశ్వనాథంగారు యీ నాడు ఏ పక్షంలో వున్నప్పటికీ న్యాయంకోసం పని చేయగలరని ఆశిస్తున్నాను. ఈనాటి cabinet త్యాగబుద్ధితో తమ జీతాలను తగ్గించుకొని ముందు వచ్చే మంత్రివర్గాలకు ఆదర్శప్రాయులుగా వుంటారని భావిస్తున్నాను. కాబట్టి ఈ సవరణ ఆమోదించి మంత్రుల జీతాలు 500 రూపాయలకు తగ్గించాలని కోరుతున్నాను.

* Sri P. GUNNAYYA:— అధ్యక్షా, ఇంతవరకు మన శాసన సభ్యులు, పరిపాలన చేస్తున్నటువంటి మంత్రులు, అన్ని వర్గాలవారు జీతాల విషయంలో మాట్లాడారు. మాకు పూజ్యులుగా ఉన్నటువంటి శ్రీ నీలం సంజీవరెడ్డిగారుకూడా మాట్లాడారు. నా నియోజకవర్గంలో సుమారు 300 గ్రామా లున్నాయి. ఇవన్నీ తిరగడానికి 15 రోజులు పడుతుంది. ఇందుకుగాను మీరు ఇచ్చే 150 రూపాయలు కాక ఇంకొక 50 రూపాయలు ఖర్చౌతున్నదని నా ఆత్మసాక్షిగా నేను చెపుతున్నాను. ఇంకా ప్రజల కొరకు ఎక్కువ త్యాగం చేసేటటువంటి వాళ్లు స్థోమతున్నవాళ్లు మనకంటే ముందుకొచ్చి అసలు T. A. కూడా తీసుకోకుండా ఉంటే ఉండవచ్చు. అందుచేత ఇప్పుడున్నటువంటి బిల్లును ఈ శాసన సభ్యులు,

[Sri P. Gunnayya] [1st December 1953

ప్రభుత్వం ఏకగ్రీవంగా ఆమోదిస్తారని, శ్రీ ప్రకాశం పంతులుగార్ని, సంజీవరెడ్డిగార్ని అనేక విధములుగా నేను అభ్యర్థిస్తున్నాను. బీదవారి విషయంలో మన రాష్ట్రంలోగాని, యావద్భారత దేశంలోగాని ప్రభుత్వ ఉద్దేశమేమంటే బీదవాళ్ళను పెద్దవాళ్ళను చేద్దామనేది ప్రభుత్వానికి ఉంది, ఇతరులకు ఉంది. గ్రామాల్లో ఉండేవాళ్ళంతా కొంతభాగం బీద వాళ్లు. గ్రామమునసబుదగ్గరఉండే తలారివాళ్ళకు ఎక్కువపని యున్నది కాబట్టి నెలకు రు. 30 లు జీతము ప్రభుత్వము ఇవ్వవలయును. ఇతర కూలి నాలి చేసుకొనేవాళ్ళకు కూలీరేటు దినమునకు రు. 1-8-0 లు నిర్ణయించ వలయును. వాళ్లకు రోజుకు ఏ 8 అణాలు కూలీ వస్తుంది. సాధారణంగా బీదవాళ్లకే 10 మంది పిల్లలుంటారు కూడా. తరువాత బడిపంతులు విషయం చూడండి; భార్యా, నలుగురు బిడ్డలు ఉంటారు. ఆ ఉపాధ్యాయుని వల్లే మనం శాసన సభ్యులుగా వచ్చాం. తెలివితేటలు ఇచ్చినటువంటివారు అలాంటి పంతులకు నెలకు 40 రూపాయలు ఇస్తున్నాం. గుమాస్తాలుగా ఉండేవాళ్లకు 60 రూపాయలో 70 రూపాయలో ఇస్తున్నదని నేను నమ్ముచున్నాను. నాన్ గెజిటెడ్ వాళ్లకు 100 కి 10, 15 రూపాయిలు హెచ్చించవలయును. మన రక్షకులుగా ఉన్నటువంటి పోలీసువాళ్లకు కూడ 30 రూపాయలు ఇస్తున్నాం. అందుచేత మన గవర్నమెంట్ ఇలాంటి తక్కువ తరగతులైనటువంటి జీతగాళ్లకు కనీసం 70 రూపాయ లైనా ఇస్తే బాగుంటుంది. శ్రీ విశ్వనాథం పంతులుగారు బీదవాళ్లకు పనిచేసినటువంటి వాళ్లు కాబట్టి ఇలా తక్కువ జీతం ఉన్నటువంటి వాళ్లకు జీతములు ఎక్కువచేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందని నేను మరీ మరీ వారికి విన్నవిస్తూ ఈ జీతములు హెచ్చు చేయడానికి ప్రభుత్వమువారు లక్షలకొలది వ్యాపారము చేసినవారి దగ్గరనుండి, ఎక్కువ డబ్బున్నవారి దగ్గరనుండి సేల్స్‌టాక్సు మూలముగా ప్రభుత్వము వారు డబ్బురాబట్టి తక్కువ జీతంగలవారికి ఎక్కువ జీతము చేయిస్తారని ప్రభుత్వమువారిని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తూ యున్నాను.

Mr. SPEAKER :— ఇప్పుడు ఈ amendments అన్నిటిని ఒక్కొక్కటి దానిమీద ఓటుకు పెడుతున్నాను.

1st December 1953] [Mr. Speaker]

I will now put Mr. M. Veerabhadram's amendment to vote. The question is:

"For the words 'one thousand' substitute the words 'Seven hundred and fifty'.

The amendment was lost.

Mr. Speaker:—
Now I will put the following amendment of Sri Vavilala Gopalakrishnaiah to the vote of the House. The question is:

"For the words 'one thousand rupees' *substitute* the words 'five hundred rupees'.

The motion was declared lost. A poll was demanded and the House divided thus:

AYES.

1. Sri T. Nagi Reddi
2. Sri P. Venkateswarlu
3. Sri M. Hanumantha Rao
4. Sri K. Venkaiah
5. Sri C. Pulla Reddi
6. Sri G. Bapanayya
7. Sri C. V. K. Rao
8. Sri K. Rajagopala Rao
9. Sri K. Krishna Rao
10. Sri Vavilala Gopalakrishnaiah
11. Sri P. Suryachandra Rao
12. Sri M. Veerabhadram
13. Sri G. Satyanarayana
14. Sri K. Govinda Rao
15. Sri G. Yellamanda Reddi
16. Sri D. Seetharamiah
17. Sri T. Potha Raju
18. Sri P. Venkatasiviah
19. Sri Saka Venkata Rao
20. Sri T. Lakshminarayana Reddi
21. Sri G. C. Kondayya
22. Sri K. V. S. Padmanabha Raju
23. Sri M. Venkatasubba Reddi
24. Sri V. Sri Krishna
25. Sri Chandra Ramalingaiah

26. Sri M. Lakshmanaswami
27. Sri N. Sivarami Reddi
28. Sri B. Sankarayya
29. Sri G. Rama Rao
30. Sri P. S. Ramachandra Rao
31. Sri K. Subba Reddi
32. Sri G. Suryanarayana
33. Sri R. Siddanna Gowd
34. Sri A. Venkatarama Raju
35. Sri V. Rama Rao
36. Sri B. Lakshminarasa Raju
37. Sri P. Rama Rao
38. Sri G. Anjaneyalu
39. Sri G. Joseph
40. Sri M. Narayanaswamy
41. Sri K. Malakondayya
42. Sri K. Pattabhi Ramaiah
43. Sri S. Kasi Reddy
44. Sri D. Lakshmayya
45. Sri K. Ranga Rao
46. Sri P. Syamasundara Rao
47. Sri C. Prabakara Choudary
48. Sri G. Nageshwara Rao
49. Sri P. Narasimha Reddi
50. Sri R. Venkatajagga Rao
51. Sri M. Kune Rao
52. Sri S. Vemiah
53. Sri K. Venkata Kurmi Naidu.

NOES

1. The Hon. Sri T. Prakasam
2. The Hon. Sri N. Sanjeeva Reddi
3. The Hon. Sri K. Koti Reddi
4. The Hon. Sri T. Viswanatham
5. The Hon. Sri D. Sanjivayya
6. The Hon. Sri S. B. P. Pattabhirama Rao
7. The Hon. Sri P. Thimma Reddi
8. Sri N. Sankara Reddi
9. Sri Raja Meka Rangayya, Appa Rao Bahadur
10. Sri N. Ramabhadra Raju
11. Sri P. Ranga Reddi
12. Sri T. N. Venkatasubba Reddi

1st December 1953]

13. Sri L. Lakshmana Das
14. Sri K. V. Vema Reddi
15. Sri B. Krishnamurthy Rao
16. Sri Ch. S. R. V. P. Murthy Raju
17. Sri N. V. L. Narasimha Rao
18. Srimathi Thamma Kotamma Reddi
19. Sri Krishnam Raja Bahadur, Raju, V. V.
20. Sri V. C. Chudamani Deo
21. Sri P. Sangannaidu
22. Sri P. Satyanarayana Reddi
23. Sri G. Nagabhushanam
24. Sri P. Venkataswami Reddi
25. Sri T. Mallayya
26. Sri Y. V. Krishna Rao
27. Sri K. Adikesavalu Naidu
28. Sri D. Ramabrahmam
29. Sri H. Satyanarayana Dora
30. Sri T. C. Atchannaidu
31. Sri K. Suryanarayana
32. Sri P. Gopalakrishna Reddi
33. Sri K. Chenchurama Naidu
34. Sri Srungaram
35. Sri R. B. V. Sudarsana Varma
36. Sri M. Doraikannu
37. Sri P. Gunnayya
38. Sri P. Venkatasubbayya
39. Sri Thota Ramaswamy
40. Sri G. Sivasankara Reddi
41. Sri K. Santhappa
42. Sri A. Rama Reddi
43. Sri K. Shanmugam
44. Sri K. Ramaiah Chowdary
45. Sri R. Lakshmi Narasimham Dora
46. Sri Y. Audinarayana Reddi
47. Sri K. Veeranna Padal
48. Sri P. Kotaiah
49. Sri Raja Sagi Suryanarayana Raju
50. Sri K. Ramamurthy
51. Sri K. Ramaiah
52. Sri Bojja Appalaswami.

Ayes : 53 ; Noes : 52.

The motion was carried.

[1st December 1953

Sri K. V. S. PADMANABHA RAJU:—ఇప్పుడు ప్రస్తుతము ప్రతిపాదించబడినటువంటి amendment గెలిచింది కాబట్టి, ప్రభుత్వము యొక్క ప్రతిపాదన వీగిపోయిందను కొంటున్నాను. అందుచేత మంత్రులు రాజీనామా యివ్వాలనేటువంటి నిర్ణయం ruling యివ్వవలసినదిగా నేను అధ్యక్షులవారిని కోరుతున్నాను. ఇది మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానం కాగలదు.

The Hon. Sri T. VISWANATHAM :—ప్రతిపక్ష సవరణ మంత్రుల జీతాలను మాత్రమే తగ్గిస్తున్నది. జీతాలు రు.1000/- అయినా రు. 500/- అయినా మంత్రులకు ఒకటే. ఇది మంత్రివర్గంపై విశ్వారాహిత్యం కాజాలదు.

Sri VAVILALA GOPALAKRISHNIAH:—Sir, I beg leave of the House to withdraw my second amendment.

The amendment was, by leave of the House, withdrawn.

Mr. SPEAKER :— ఇప్పుడు మూడవక్లాజులో మిగిలిన సవరణలన్నీ వీగిపోయినట్లే అని అనుకోవలసియుంటుంది.

Clause 3, as amended, was put and carried.

## CLAUSE 4.

Mr. SPEAKER :— తరువాత 4వ క్లాజు. ఈక్లాజులో సవరణలన్నీ withdraw చేసుకోబడినవి. కనుక ఈ నాల్గవ క్లాజును వోటుకు పెటుతున్నాను.

Clause 4 was put and carried.

## CLAUSE 5.

Mr. SPEAKER :—The motion is :

"That clause 5 do stand part of the Bill."

Sri K. VENKIAH :—Mr. Speaker, I move the following amendment :—

"Delete clause 5"

1st December 1953]

Sri M. VEERABHADRAM :— Sir, I second the amendment moved by Sri K. Venkiah.

Sri K. GOVINDA RAO:—Mr. Speaker, I move the following amendment:—

"Delete clause 5 and renumber the following clauses."

Sri M. VEERABHADRAM:—Sir, I second the amendment moved by Sri K. Govinda Rao.

Sri VAVILALA GOPALAKRISHNAIAH :— Mr. Speaker, I move the following amendments standing in my name.

1) "For the words, 'six hundred rupees', substitute the words 'three hundred rupees'."
2) "For the words, 'five hundred rupees', substitute the words 'three hundred rupees'."
3) "For the words 'two hundred and fifty rupees', substitute the words, 'one hundred rupees'."

Sri K. GOVINDA RAO:—Sir, I second the amendments moved by Sri Vavilala Gopalakrishniah.

Sri B. SANKARAYYA:—Mr. Speaker, I move the following amendment.

"Delete clause 5 of the Bill."

Sri G. ANJANEYULU—Sir, I second the amendment moved by Sri B. Sankarayya.

Mr. SPEAKER:— Now, I will put the amendment of Sri B. Sankarayya to the vote of the House.

The question is:

"Delete clause 5 of the Bill."

The amendment was declared carried.

A poll was demanded and the House divided thus:

AYES.

1. Sri T. Nagi Reddi
2. Sri P. Venkateswarlu

3. Sri M. Hanumantha Rao
4. Sri K. Venkiah
5. Sri C. Pulla Reddi
6. Sri G. Bapanayya
7. Sri C. V. K. Rao
8. Sri K. Rajagopala Rao
9. Sri K. Krishna Rao
10. Sri Vavilala Gopalakrishniah
11. Sri P. Suryachandra Rao
12. Sri M. Venkatasubba Reddi
13. Sri K. V. S. Padmanabha Raju
14. Sri G. C. Kondayya
15. Sri T. Lakshminarayana Reddi
16. Sri Saka Venkata Rao
17. Sri P. Venkatasivaiah
18. Sri T. Potha Raju
19. Sri D. Seethramaiah
20. Sri G. Yellamanda Reddi
21. Sri K. Govinda Rao
22. Sri G. Satyanarayana
23. Sri M. Veerabhadram
24. Sri V. Sri Krishna
25. Sri Chandra Ramalingaiah
26. Sri M. Lakshmanaswami
27. Sri N. Sivarami Reddi
28. Sri B. Sankarayya
29. Sri G. Rama Rao
30. Sri P. S. Ramachandra Rao
31. Sri K. Subba Reddi
32. Sri G. Suryanarayana
33. Sri R. Siddanna Gowd
34. Sri K. Pattabhi Ramaiah
35. Sri K. Malakondayya
36. Sri M. Narayanaswamy
37. Sri G. Joseph
38. Sri G. Anjaneyulu
39. Sri P. Rama Rao
40. Sri B. Lakshminarasa Raju
41. Sri V. Rama Rao
42. Sri A. Venkataramaraju
43. Sri S. Kasireddy
44. Sri D. Lakshmayya
45. Sri K. Ranga Rao
46. Sri P. Syamasundara Rao

1st December 1953]

47. Sri G. Prabakara Choudary
48. Sri G. Nageshwara Rao
49. Sri P. Narasimha Reddi
50. Sri R. Venkatajagga Rao
51. Sri M. Kune Rao
52. Sri S. Vemiah
53. Sri K. Venkata Kurmi Naidu

NOES.

1. The Hon. Sri T. Prakasam
2. The Hon. Sri N. Sanjeeva Reddi
3. The Hon. K. Koti Reddi
4. The Hon. Sri T. Viswanatham
5. The Hon. Sri D. Sanjivayya
6. The Hon. Sri S. B. P. Pattabhirama Rao
7. The Hon. Sri P. Thimma Reddi
8. Sri N. Sankara Reddi
9. Sri Raja Meka Rangayya, Appa Rao Bahadur
10. Sri N. Ramabhadra Raju
11. Sri N. V. L. Narasimha Rao
12. Sri K. Appala Naidu
13. Sri Asi Neeladrirao Reddi
14. Sri Ch. S. R. V. P. Murthy Raju
15. Sri B. Krishnamurthy Rao
16. Sri K. V. Vema Reddi
17. Sri L. Lakshmana Das
18. Sri T. N. Venkatasubba Reddi
19. Sri P. Ranga Reddi
20. Sri Y. V. Krishna Rao
21. Sri Kavali Narayana
22. Sri B. Gangayya Naidu
23. Sri P. Bapu Naidu
24. Sri T. Mallayya
25. Sri P. Venkataswami Reddi
26. Sri G. Nagabhushanam
27. Sri P. Satyanarayana Reddi
28. Sri P. Sangannaidu
29. Sri V. C. Chudamani Deo
30. Sri Krishnam Raja Bahadur, Raju V. V.
31. Srimathi Thamma Kotamma Reddi
32. Sri D. Basivi Reddi
33. Sri N. Venkatayya
34. Sri Srungaram

35. Sri K. Chenchurama Naidu
36. Sri P. Gopalakrishna Reddi
37. Sri K. Suryanarayana
38. Sri T. C. Atchnnaidu
39. Sri H. Satyanarayana Dora
40. Sri D. Ramabrahmam
41. Sri K. Adikesavalu Naidu
42. Sri K. Ramiah Chowdary
43. Sri K. Bapanna Dora
44. Sri K. Shanmugam
45. Sri A. Rama Reddi
46. Sri K. Santhappa
47. Sri G. Sivasankara Reddi
48. Sri Thota Ramaswamy
49. Sri P. Venkatasubbayya
50. Sri P. Gunnayya
51. Sri M. Doraikannu
52. Sri R. B. V. Sudarsana Varma
53. Sri R. Lakshmi Narasimham Dora
54. Sri Y. Audinarayana Reddi
55. Sri K. Veeranna Padal
56. Sri Raja Sagi Suryanarayana Raju
57. Sri K. Ramamurthy
58. Sri K. Ramaiah
59. Sri Bojja Appalaswami

NEUTRAL.

Sri N. V. Rama Rao

Ayes: 53, Noes: 59, Neutral: 1.
The Motion was lost.

Mr. SPEAKER:—I want to know whether I should put the first amendment of Sri Vavilala Gopalakrishnaiah to vote.

The Hon. Sri N. SANJEEVA REDDI:—Let it be put to vote, Sir. It will do credit to the Opposition.

Sri T. NAGI REDDI:—It does not do credit to the Assembly or the Opposition. But it does credit to the Government if they accept the sensible proposition now made by the Opposition.

1st December 1953]

Mr. SPEAKER:—The question is :

"For the words 'six hundred rupees', substitute the words 'three hundred rupees'."

The amendment was declared lost.

A poll was demanded and the House divided thus :

AYES.

1. Sri T. Nagi Reddi
2. Sri P. Venkateswarlu
3. Sri M. Hanumantha Rao
4. Sri K. Venkaiah
5. Sri C. Pulla Reddi
6. Sri G. Bapanayya
7. Sri C. V. K. Rao
8. Sri K. Rajagopala Rao
9. Sri K. Krishna Rao
10. Sri Vavilala Gopalakrishniah
11. Sri P. Suryachandra Rao
12. Sri M. Venkatasubba Reddi
13. Sri K. V. S. Padmanabha Raju
14. Sri G. C. Kondaiah
15. Sri T. Lakshminarayana Reddi
16. Sri Saka Venkata Rao
17. Sri P. Venkatasivaiah
18. Sri T. Potha Raju
19. Sri D. Seetharamiah
20. Sri G. Yellamanda Reddi
21. Sri K. Govinda Rao
22. Sri G. Satyanarayana
23. Sri M. Veerabhadram
24. Sri V. Sri Krishna
25. Sri Chandra Ramalingaiah
26. Sri M. Lakshmanaswami
27. Sri N. Sivarami Reddi
28. Sri B. Sankarayya
29. Sri G. Rama Rao
30. Sri P. S. Ramachandra Rao
31. Sri K. Subba Reddi
32. Sri G. Suryanarayana
33. Sri R. Siddanna Gowd
34. Sri K. Pattabhi Ramaiah
35. Sri K. Malakondayya

36. Sri M. Narayanaswamy
37. Sri G. Joseph
38. Sri G. Anjaneyulu
39. Sri P. Rama Rao
40. Sri B. Lakshminarasa Raju
41. Sri V. Rama Rao
42. Sri A. Venkataramaraju
43. Sri S. Kasireddy
44. Sri D. Lakshmayya
45. Sri K. Ranga Rao
46. Sri P. Syamasundara Rao
47. Sri C. Prabhakara Chowdary
48. Sri G. Nageswara Rao
49. Sri P. Narasimha Reddi
50. Sri R. Venkatajagga Rao
51. Sri M. Kune Rao
52. Sri S. Vemiah
53. Sri K. Venkata Kurmi Naidu

NOES.

1. The Hon. Sri T. Prakasam
2. The Hon. Sri N. Sanjeeva Reddi
3. The Hon. Sri K. Koti Reddi
4. The Hon. Sri T. Viswanatham
5. The Hon. Sri D. Sanjivayya
6. The Hon. Sri S. B. P. Pattabhirama Rao
7. The Hon. Sri P. Thimma Reddi
8. Sri N. Sankara Reddi
9. Sri Raja Meka Rangayya, Appa Rao Bahadur
10. Sri N. Ramabhadra Raju
11. Sri N. V. L. Narasimha Rao
12. Sri K. Appala Naidu
13. Sri Asi Neeladrirao Reddi
14. Sri Ch. S. R. V. P. Murthy Raju
15. Sri B. Krishnamurthi Rao
16. Sri K. V. Vema Reddi
17. Sri L. Lakshmana Das
18. Sri T. N. Venkatasubba Reddi
19. Sri P. Ranga Reddi
20. Sri Y. V. Krishna Rao
21. Sri Kavali Narayana
22. Sri B. Gangayya Naidu

1st December 1953]

23. Sri P. Bapu Naidu
24. Sri T. Mallayya
25. Sri P. Venkataswami Reddi
26. Sri G. Nagabhushanam
27. Sri P. Satyanarayana Reddi
28. Sri P. Sangannaidu
29. Sri V. C. Chudamani Deo
30. Sri Raju V. V. Krishnam Raja Bahadur
31. Srimathi Thamma Kotamma Reddi
32. Sri D. Basivi Reddi
33. Sri N. Venkatayya
34. Sri Srungaram
35. Sri K. Chenchurama Naidu
36. Sri P. Gopalakrishna Reddi
37. Sri K. Suryanarayana
38. Sri T. C. Atchannaidu
39. Sri H. Satyanarayana Dora
40. Sri D. Ramabrahmam
41. Sri K. Adikesavalu Naidu
42. Sri K. Ramaiah Chowdary
43. Sri K. Bapanna Dora
44. Sri K. Shanmugam
45. Sri A. Rama Reddi
46. Sri K. Santhappa
47. Sri G. Sivasankara Reddi
48. Sri Thota Ramaswamy
49. Sri P. Venkatasubbayya
50. Sri P. Gunnayya
51. Sri M. Doraikannu
52. Sri R. B. V. Sudarsana Varma
53. Sri R. Lakshminarasimham Dora
54. Sri Y. Audinarayana Reddi
55. Sri K. Veeranna Padal
56. Sri Raja Sagi Suryanarayana Raju
57. Sri K. Ramamurty
58. Sri K. Ramaiah
59. Sri Bojja Appalaswami

**NEUTRAL.**

Sri N. V. Rama Rao

Ayes: 53; Noes: 59; Neutral: 1.

The amendment was lost.

Mr. SPEAKER:— I am now putting the second amendment of Sri Vavilala Gopalakrishniah to the vote of the House.

The question is:

"For the words, 'Five hundred rupees', substitute the words, 'Three hundred rupees'."

The amendment was lost.

Mr. SPEAKER:—I am now putting the third amendment of Sri Vavilala Gopalakrishniah to the vote of the House:

The question is:

"For the words 'Two hundred and fifty rupees', substitute the words, 'one hundred rupees'."

The amendment was lost.

CLAUSE 5 was put and carried.

CLAUSES 6, 7, 8, 9 and 10 were put and carried

CLAUSE 11.

Sri VAVILALA GOPALAKRISHNIAH:—I move the following amendment to sub-clause (1) (a) of Clause 11.

"For the words 'one hundred and fifty rupees', substitute the words 'one hundred rupees'.

Mr. SPEAKER:—The amendment falls through for want of a seconder.

CLAUSE 11. was put and carried

CLAUSE 12. was put and carried

CLAUSE 13.

Sri T. LAKSHMINARAYANA REDDI:—Sir, I move the following amendment that stands in my name, namely:

"Add a new sub-clause (3) to clause 13 as follows:
'(3) A copy of the rules shall be placed on the Table of the Legislative Assembly immediately

following the making of the rules. Any member may move for the amendment of any of the rules and the rules so amended shall be final and binding."

Sri K. KRISHNA RAO:—I second the amendment, Sir.

The Hon. Sri T. VISWANATHAM :— మామూలుగా యిప్పుడు table పైన పెట్టవలసిన రూల్సు proper గా తయారుచేస్తున్నాం. Rules ఏ విధంగా table మీాద పెట్టాలో, చర్చకు అవకాశం యివ్వాలో, యీా అన్ని విషయాలమీాద విచారిస్తున్నాం కనుక ఇది యిప్పుడు accept చేయడానికి వీలులేదు. యత్నం చేస్తున్నాం. ఏప్రిలు నెలలో యిన్ని rules మీా ముందు పెడతాము. అప్పుడు మీారే చూస్తారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అప్పుడు సరిగా దానిక్రింద తయారు చేసినట్టి rules ను members ముందు పెట్టాలని assurance క్రింద తిసుకో వచ్చునా ?

The amendment was, by leave of the House, withdrawn.

CLAUSE 13 was put and carried.

CLAUSES 14, 15 and 1, and the Preamble were then put one by one and carried

The Hon. Sri N. SANJEEVA REDDI :—Sir, I move that the Bill be passed into law.

Mr. SPEAKER :—Motion moved :
'That the Bill be passed into law.'

Sri PILLALAMARRI VENKATESWARLU:—ఇప్పుడు చాలా అసమానమైనటువంటి amendment ఒకటి pass చేశాం. మంత్రులయొక్క జీతాలు ఒక్క మాసం అయినా అమలు జరపడం నా ఉద్దేశం కాబట్టి అలా అమలుకు తీసుకురావలసిందని అనుకుంటున్నాను. తప్పని సరిగా ఇది అమలు జరుపవలసిన అవసరంకూడా ఉంది. అందుచేత దాన్ని ఆమోదిస్తున్నాం. (ఆసీనులై తిరిగిలేచి) Point of Information, Sir,

[Sri Pillalamarri Venkateswarlu] [1st December 1953

ఇప్పుడు ఈ బిల్లును పాస్ చేశాం. మంత్రులు తమ జీతాలను ఈరోజు నుంచి ఐదు వందల రూపాయల చొప్పున తీసుకుంటారా? లేక,...(నవ్వు)

Mr. SPEAKER :—The question is —

"That the Bill be passed into law".

The motion was carried and the Bill was passed into law.

## IV. HOUSE COMMITTEE

The Hon. Sri T. PRAKASAM:—ఈ House Committee ఏర్పాటు చేయడం విషయమై నేను ఈ motion ను move చేస్తున్నాను.

"That with reference to Rule 157 of the Assembly Rules, the House do proceed to elect 11 members to be members of the House Committee for the financial year 1953-54."

Mr. SPEAKER :—In accordance with the Regulations framed by me for the holding of elections according to the principle of proportional representation by means of the single transferable vote, I fix 3 p. m. on 2nd December 1953 as the time within which nomination papers of candidates for election to the House Committee should reach the Secretary.

"If the number of candidates nominated exceeds the number of seats to be filled, namely, eleven, a poll will be taken on a date to be announced in due course."

## V. COMMITTEE OF PRIVILEGES

The Hon. Sri T. PRAKASAM :—"That with reference to sub-rule (1) of Rule 156 of the Madras Assembly Rules, the Assembly do proceed on a date to be fixed by the Speaker to elect according to the principle of our proportional representation by means of the single transferable vote 15 members to be the members of the Committee of Privileges.

Mr. SPEAKER :— In accordance with the Regulations framed by me for the holding of elections according to the principle of proportional representation by means of the single transferable vote, I fix 3 p.m. on 2nd December

1st December 1953] [Mr. Speaker]

1953 as the time within which nomination papers of candidates for election to the Committee of Privileges should reach the Secretary. Nomination forms can be had on application to the Secretary.

"If the number of candidates nominated exceeds the number of seats to be filled, namely, fifteen, a poll will be taken on a date to be announced in due course."

ఈ అజెండాలో ఉన్నటువంటి యావత్తు కార్యక్రమము పూర్తి అయిపోయింది.

The House stands adjourned *sine die*.

An Hon'ble Member:

మళ్ళీ సమావేశం ఎప్పుడు ఉంటుందండీ ?

Mr. SPEAKER :— వాయిదా ఫలానా అప్పుడు అని తెలియదు. తరువాత నోటీసు వస్తుంది.

The House then adjourned *sine die*.